# చందమామ

పిల్లల కథల మాస పత్రిక





Chandamama, December, '49

Photo by B. N. Konda Reddy

నే చీలె కట్టుకున్నా!

# చందమామ

ఈ సంచికలో యివి
చదువుకోండి



ఇవన్నీగాక పజిలు, ముగ్గులు,
ఇంకా, ఇంకా ఎన్నోవున్నై.

**చందమామ ఆఫీసు**
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు. 1.

# చందూ యొక్క సాహసకృత్యములు


















ది తాతా ఆయిల్ మిల్స్ కంపెని లిమిటెడ్

## చందమామ
## చందాదారులకు మనవి

చందమామ ప్రతినెల, గతనెలాఖరులోనే చందాదారులకు పోస్టు చేయబడును. కాపీ చేరనిఎడల మొదటి ఆరు తారీఖులలోగా తమ పోస్టాపీసులో విచారించి, మాకు తెలియజేయాలి. 10 వ తారీఖు తరువాత వచ్చు కంప్లెయింట్లు ఆమోదింపబడవు. గడచిన మాసములలో చేరలేదనే కంప్లెయింట్లు గమనింపబడవు.

మేనేజరు




సావరిన్ స్వీట్స్

ది కె. సి. పి. కన్ఫెక్షనరీ(మద్రాసు) లిమిటెడ్, మద్రాసు-24.

24-11-'49 ఆంధ్రదేశంలోని అన్ని ముఖ్య కేంద్రాలలో విడుదల.

యం. ఆర్. ఏ. ప్రొడక్షన్సు వారి

# మనదేశం.

కృష్ణవేణి... నాగయ్య...

నారాయణరావు... N.T. రామారావు... హేమలత.. కాంచన.

డైరెక్షన్.... ప్రసాద్.

స్టూడియో.... శోభనాచల.




సంపుటి 5
సంచిక 6

సంచాలకుడు: చక్రపాణి

డిసెంబరు
1949

పాపాయిలూ!

రెండేండ్లకుపైగా ప్రతినెలా, మీరు 'ఏటుకూరి' వారి గేయకథలను చందమామలో చదువుతూవున్నారు. వారి పూర్తిపేరు మీకు తెలుసా? 'కవిబ్రహ్మ' ఏటుకూరి - వెంకటనరసయ్యగారు. ఆయన తెలుగులోనూ, సంస్కృతంలోనూ మంచి పండితులు. క్షేత్రలక్ష్మి, మగువమాంచాల, బాలచంద్రుడు, వీరభారతం, నాయకురాలు మొదలైన గొప్ప కావ్యాలు ఎన్నో రచించారు. రైతుహరికథ వ్రాసి నూటపదహార్లు బహుమానం పొందారు. చిన్న పిల్లలకోసం ప్రత్యేకించి నీతిమంజరి, బాలవాఙ్మయం వంటి చక్కటి పుస్తకాలు ప్రకటించారు. కాగా, వారి చిత్రమైన గేయాలను మీరు చవిచూచేవున్నారు. ఐతే, ఇంతటి గొప్పకవి అయిన 'ఏటుకూరి' వారి గేయాలు ఇకముందు మీకు లభించవు. మిత్రులనూ, బంధువులనూ, కుటుంబాన్నీ సంతాపంలో ముంచి, వారు ఈ నవంబరునెల 10-వ తేది రాత్రి 11 గంటలకు నిడుబ్రోలులో టైఫాయిడ్ జ్వరంవల్ల స్వర్గస్థులైనారు.

కవిబ్రహ్మ ఆత్మకు శాంతి కలగాలని భగవంతుని ప్రార్థిస్తూ, ఈ సంతాప సమయంలో వారి కుటుంబానికి సానుభూతి తెల్పడం మనందరకూ విధి.







# సీనూ - భానూ

సీనూ భానూ చక్కని
స్నేహితులని చెప్పాలి.
కలిసి బడికి పోతారు,
కలిసి యిళ్లకొస్తారు.

సీనూ భానూ ఎంతో
స్నేహంగా ఉంటారు.
కలిసి చదువుకుంటారు,
కలిసి ఆడుకుంటారు.

కొత్త కొత్త పుస్తకాలు
కొనడం వాళ్లకి సరదా;
కొత్త కొత్త ఆటల్లో
కూడా వాళ్లకి సరదా.

ఆటలలో ఒక రోజున,
మాటమీద మాట వచ్చి,
సీనుడొచ్చి భానుగాణ్ణి
చెంపమీద వేశాడు.

భాను మాత్ర మేం తక్కువ?
సీనుమీద విరుచుకు పడి,
వీసె గుద్దు లొక నాలుగు
వీపున వడ్డించాడు.

వీళ్లిట్లా పోట్లాడే
వేళ వాళ్ల నాన్నలు అ

రచన:
'శ్రీ. శ్రీ.'

చోటికొచ్చి చూశా రీ
చోద్యమైన గుద్దులాట.

సీను నాన్న తప్పంతా
భాను దనీ, భాను నాన్న
సీనుదనీ తీవ్రంగా
వాదనలో పడ్డారు.

వాదనతో ఆగలేదు;
వా ళ్లిద్దరి మధ్యా అది
పెరిగి పెరిగి తుట్టతుదకు
పెద్ద గుద్దు లా టయింది.

తండ్రుల యుద్ధం చూస్తే
తమ కెంతో వింత కలిగి,
సీనూ భానూ ఎప్పటి
స్నేహితులై మిగిలినారు.

మళ్లీ వాళ్లిద్దరు తమ
మామూ లాటల్లో పడి,
కొట్లాడే తమ తండ్రుల
మాటే మరిచారు.

ఆ పిల్లలు వెనుకటి వలె
ఆటలాడు తున్నారు.
తండ్రుల యుద్ధం మాత్రం
తగ్గే సూచన లేదు!










# యుక్తిపరుడు

అనగనగా ఒక నగరములో ముగ్గురు స్నేహితులు ఉండేవారు. అందులో ఒకడు ధనికుడు, రెండవవాడు విద్వాంసుడు, మూడవవాడు యుక్తిపరుడున్ను.

ఈ ముగ్గురిలో ఒకప్పుడు 'నేను అధికుడ' నంటే 'నేను అధికుడను' అని వాదోపవాదాలు బయల్దేరినై. అప్పుడు వారిలో ఒకడు "అబ్బాయీ! ఈ నగరపు రాజకుమారి 'నేను పురుషుల ముఖము చూడను' అని శపథం పట్టి, పురుషుల కంట పడకుండా ప్రత్యేకం ఒక మేడ కట్టించుకొని, అందులో ఉంటున్నది. ఆ రాజకుమారితో మాటాడి, ఆమెను పెళ్లాడిన వాడే సమర్థు"డని చెప్పేవరకు, తక్కిన ఇద్దరూ అందుకు ఒప్పుకున్నారు.

వెంటనే ధనికుడు రాజకుమారికి తెలిసేలాగ సంతర్పణలు, సమారాధనలు, దానాలు, ధర్మాలు చేయ నారంభించాడు. తన ఖజానాలో ఉండే వజ్రాలూ, వైడూర్యాలూ, నవరత్నాలతో పొదిగిన ఆభరణాలూ ప్రదర్శించటం ప్రారంభించాడు.

రాజకుమారి తననుమెచ్చి పలకరించక పోతుందా అని అతను కనిపెట్టుకొని వున్నాడు. ఈ ధనికుని ఐశ్వర్యాన్నిగురించీ, దాతృత్వాన్నిగురించీ దాసీలు రాజకుమారితో చెప్పగా, ఆమె "ఆ మనిషి స్త్రీయా, పురుషుడా?" అని అడిగింది.

"పురుషుడే" అని చెప్పారు, దాసీలు.

"ఐతే పురుషుల విషయం నాముందు చెప్పబోకండి!" అని రాజకుమారి చీదరించుకొన్నది. ఇది విని ధనికుడు తన ప్రయత్నాలన్నీ మానుకోవలసివచ్చింది.

తరువాత విద్వాంసుని వంతు వచ్చింది. అతను రాజవీధిలో మకామువేసి, పరకాయ ప్రవేశము, అదృశ్యకరణి మొదలైన విద్యలన్నీ అతి చమత్కారంగా ప్రదర్శింప

యం. వీరయ్య, వెలిగొండ





సాగాడు. ఈ విద్వాంసుని ప్రజ్ఞనుగురించి దాసీలు రాజకుమారితో చెప్పేవరకు, ఆమె "సరే, ఇన్ని ప్రజ్ఞలు చూపుతున్న ఆ మనిషి పురుషుడా, స్త్రీయా? అనిఅడిగింది.

"పురుషుడే" అన్నారు దాసీలు.

"ఛఛ! పురుషుల విషయం నాముందు చెప్పకండి. మళ్ళీ ఎన్నడైనా ఇటువంటి సంగతి నా చెవిని వేశారంటే, తలకొట్టించి కోట గుమ్మానికి వేలాడదీయిస్తాను" అంటూ రాజకుమారి హెచ్చరించింది.

ఇది తెలిసి విద్వాంసుడుకూడా నిరాశ చెంది, మరలిపోయాడు.

చివరకు యుక్తిపరుని వంతు వచ్చింది. యుక్తిపరుడు వెళ్ళివెళ్ళి రాజకుమారికి వాడుకగా పువ్వులమాలలు అల్లిఇస్తూవుండే ఒక ముసలమ్మ ఇంట బసచేశాడు.

ఒకరోజున యుక్తిపరుడు ఎక్కడివో చిత్రమైన రకరకాల పువ్వులు పట్టుకవచ్చి, దండగుచ్చి ముసలిదానికిచ్చి "అవ్వా! అవ్వా!! ఇవాళ పూలమాల నేను కట్టాను. ఈ పూలమాల తీసుకువెళ్లి రాజకుమారికి ఇవ్వు. ఆమె చూచి సంతోషించి, 'దీనిని ఎవరుకట్టారు?' అని నిన్ను అడుగుతుంది. అందుకు బదులుగా 'నిన్నటిరోజున మా అక్కకూతురు ఊరినించి వచ్చిందండి. ఈ దండ ఆమె కట్టింది' అను. తరువాత మళ్లీ రాజకుమారి ఏమి అంటుందో, వచ్చి నాతో చెప్పు" అన్నాడు.

అవ్వ అతను చెప్పినట్టే చేయగా, రాజకుమారి చాలా సంతోషించి, "అవ్వా, అవ్వా!! నీ అక్కకూతురును నేను చూడాలి. రేపు నీతో వెంటబెట్టుకు రావలసింది" అన్నది.

ముసలమ్మ ఇంటికి వచ్చి యుక్తిపరునితో జరిగినసంగతి చెప్పింది. మరునాడు యుక్తిపరుడు స్త్రీవేషంధరించి అవ్వవెంబడి రాజకుమారి భవనానికి వెళ్ళాడు.



స్త్రీరూపంతో ఉన్నది పురుషుడు అని రాజకుమారి, ఎంతమాత్రమూ గుర్తుపట్ట లేక పోయింది. ఆ స్త్రీని తన చెలికత్తెగా చూచుకొంటూ రాజకుమారి తన మనసులోని రహస్యాలెన్నో దాపరికం లేకుండా చెప్పివేసింది.

కొంతసేపైన తరువాత యుక్తిపరుడు "రాజకుమారీ! నిన్నొక ప్రశ్న వేస్తాను. నిజం చెబుతావా?' అని అడిగాడు.

"తప్పక చెబుతా"నన్నది రాజకుమారి.

"అయితే, పురుషుని ముఖం చూడనని నీవు శపథం చేశావుట కదా? పురుషులంటే నీకెందుకు కోపం?" అన్నాడు.



అప్పుడు రాజకుమారి "చెలీ! ఇది నా జీవితంలో చాలా రహస్యవిషయం. కాని, ప్రాణ సమానురాలవు గనుక నీకు చెబుతున్నాను. ఎవ్వరికీ వెల్లడించకూడదు సుమా! అసలు విషయం ఏమిటంటే—

వెనుకటి జన్మలో నేనూ, నా భర్తా మృగాలుగా ఉండేవాళ్ళం. ఒకనాడు ఇద్దరమూ వేటగాని వలలో చిక్కుకోగా, గర్భిణి అయివున్న నేను తప్పించుకు పోలేకపోయాను. కాని, నా భర్త నా గొడవ తలచనైనా తలచక, తనదారిన తను పోయాడు. ఇక గత్యంతరమేముంది? వేటగాడు నన్ను పట్టి చంపివేశాడు. అప్పటినించీ స్వార్థపరులైన మగవాళ్ళంటే నాకు పరమ అసహ్యం. కనుకనే మగవాని ముఖం చూడను అని అప్పుడు నేను ఒట్టుపెట్టుకొన్నాను. నేను పూర్వజన్మ స్మృతి కలదానను. అందుచేత ఈవిషయం జ్ఞాపక ముంచుకొని, నీకు చెప్పగలిగాను" అని చెప్పింది.

ఇది విని, ఇంకాఉంటే తన వేషంకాస్తా బయల్పడుతుందనే భయంతో, యుక్తిపరుడు మరి ఒక్క క్షణమైనా అక్కడ నిలవక, ఇంటికి వెళ్ళిపోయాడు.



తరువాత అతను ఒక యతీశ్వరుని వేషం వేసికొని, రాజుగారి కోట పక్కని తోటలో మకాం ఏర్పరుచుకొన్నాడు. అక్కడ ఉండే తోటమాలితో యుక్తిపరుడు "అబ్బాయీ! నాకోసం మగవాళ్ళు ఎంతమంది వచ్చినా రానీ. కాని స్త్రీలను మాత్రం రానీయకు. జాగర్త! స్త్రీలు వచ్చినట్టయితే శపించి వేస్తాను" అని చెప్పేవరకు, ఆడపురుగైనా ఆ యతీశ్వరునివద్దకు రాకుండా, తోట మాలి కాపలా కాస్తున్నాడు.

ప్రతిరోజూ పట్టణంలో మగవాళ్ళంతా ఆయనవద్దకు వచ్చి, దీవెనలు అందుకొని పోతూవున్నారు. యతీశ్వరుని ప్రఖ్యాతి క్రమంగా రాజుగారి చెవినికూడా పడింది. ఒకరోజున రాజు స్వయంగా ఆయనవద్దకు వచ్చి, "మహానుభావా! తమరు మా కోటకు దయచేసి, మాగృహం పావనంచేసి, మమ్మల్ని ధన్యుల్ని చేయండి" అంటూ ప్రార్థించాడు.

అందుకు బదులుగా యతీశ్వరుడు స్త్రీముఖం చూడననే తన శపథం ఆయ నకు వెల్లడించాడు.

అప్పుడు రాజు "స్వామీ! మీ వ్రతానికి భంగం కలగకుండా చేస్తాను" అనిచెప్పి,




కోటలోకి ఆడవాళ్ళెవరూ రాకుండా కట్టు బాట్లుచేసి, యతీశ్వరుణ్ణి అతి వైభవంతో తన భవనానికి తీసుకుపోయాడు.

ఈ యతీశ్వరుని సమాచారమంతా ఎలాగో రాజకుమారి చెవుల బడింది. "యిదేమిటీ వింత! నా ప్రతిజ్ఞకు సరిగా ఎదురుప్రతిజ్ఞ అయిఉన్నదే, మునీశ్వరుడు పట్టినది," అని ఆమె ఆశ్చర్యపడింది. ఇటువంటి చిత్రమైన మనిషిని చూచి తీరాలి అని, రాజకుమారి తన అంతఃపురపు కిటికీకి ఒక తెర కట్టించుకొని, యతీశ్వ రుని తొంగిచూస్తూ, అతను చెప్పేదంతా శ్రద్ధగా ఆలకించుతూ వుంది.

రాజు గొప్పగా స్వామిని పూజించి, అఖండమైన భిక్ష చేయించి, చివరకు "స్వామీ! నాకు ఉన్న సంశయాలన్నీ తీర్చారు. కాని, ఒక్కటిమాత్రం ఉండి పోయింది. తాము ఎందువల్ల స్త్రీముఖం చూడరో, కారణం చెప్పాలి" అంటూ పట్టుదలగా అడిగాడు.

"రాజా! నీవు ప్రాధేయపడుతున్నావు గనుక, చెబుతున్నా, విను: వెనుకటి జన్మలో నేనూ నా భార్యా మృగాలుగా పుట్టాము. ఒకరోజున మేము ఒక వేటగాని వలలో చిక్కుకొన్నాము. అప్పుడు గర్భిణిగావుండిన నా భార్య నన్ను వదిలేసి, తనుమట్టుకు తప్పించుకు పారిపోయింది. కనుక, స్త్రీజాతి ముఖం చూడకూడదు అని నేను ప్రతిజ్ఞ చేశాను. పూర్వజన్మ స్మృతి కలిగిఉండటంచేత, ఈకథ జ్ఞాపకముంచుకొని, వెల్లడిచేయగలిగాను" అని ముని వేషంలో వున్న యుక్తిపరుడు చెప్పాడు.

ఈ మాటలు కిటికీలోనించి విన్న రాజకుమారి గబగబ కిందికి దిగివచ్చి, యతీశ్వరుని ఎదుట నిలబడి, "అయ్యా! నీవు అబద్ధము చెబుతున్నావు. వలలో నుండి తప్పించుకొనిపోయింది ఆడమృగమా, మగమృగమా? నిజం చెప్పు. వెనుకటి జన్మమందు ఆడమృగమునై పుట్టింది నేను. వలలో చిక్కుకొని, వేటగాని చేతిలో చచ్చిందికూడ నేనే. నిజం కప్పిపుచ్చి, ఈ సంగతి ఎవరికీ తెలియదుకదా అని నాపైన అబద్ధం చెబుతున్నావు. నిజానికి ఈ వృత్తాంతం నాకూ నా భర్తకూ తప్ప మరెవ్వరికీ తెలియదు. కనుక, నీవే నా భర్తవు" అంటూ, అతని చేయి పట్టుకున్నది!

అమె కోరికపైని, రాజు ఆ ఇద్దరకూ అతి వైభవంగా పెళ్ళిచేశాడు. వాళ్ళు హాయిగా ఉంటున్నారు. యుక్తిపరుడే తమకంటె అధికుడూ, సమర్థుడూ అని తక్కిన ఇద్దరూ ఒప్పుకొన్నారు.






ఆవేశంలో గుణసుందరి చెప్పకూడని రహస్యం చెప్పివేయడంచేత, పాపం, దైవాధీనం బావిలో పడినప్పుడే ఎలుగుబంటిగా మారిపోయాడు. అతను దుఃఖిస్తూ, ఎలాగో పైకివచ్చి, ఇంటిదారి పట్టాడు.

పోతే, గుణసుందరి చెప్పకూడని రహస్యాన్ని చెప్పివేసిందేకాని, వెంటనే తెలివి వచ్చి, గాబరాతో ఇంటికి వెళ్లి చూచుకొనే వరకు తులసిమొక్క వాడిపోయివున్నది. ఇంకేమున్నది ?—తన అపరాధంమూలాన భర్తకు కీడుమూడింది. గురుశాపంప్రకారం అతను ఈపాటికి ఎలుగుబంటిగా మారిపోయివుంటాడు, అని భరించరాని విచారంతో గోడుగోడున ఏడుస్తూ, ఆ తులసి దగ్గరే స్పృహతప్పి పడిపోయింది.

అక్కడ రాజుగారికి చాలా ప్రమాదంగా ఉన్నది. ఏమిటిరా భగవంతుడా అని కోటలో అందరూ చింతిస్తున్న సమయంలో, హరమతీ కాలమతులు మహేంద్రమణిని తీసుకువచ్చి, మహారాజు ఎదుట పెట్టారు. అదిచూచి, తండ్రిరాజ్యం తమకే దక్కింది కదాఅని రూపా, హేమలు పొంగిపోయారు.

కాని, మణిని చూచి రాజవైద్యుడు "ఇది ప్రకాశించటం లేదే !" అన్నాడు. 'ఉండండి, మంత్రం చెప్పాలి' అంటూ అన్నాతమ్ముడూ అట్టహాసంగా "హనుమంతు తోక" అనీ, "నిగనిగ" అనీ అరుస్తూ మణిచుట్టూ తిరుగసాగారు. వాళ్లు ఎంతగా అరచినా, మణి ప్రకాశించలేదు. ఇదేమి మంత్రమంటూ అందరూ తెల్లబోయారు. "నన్ను మోసం చేసి, రాజ్యం లాక్కోవటానికి ఏదో రాయి పట్టుకొచ్చారు. వీళ్ల తలలు ఖండించి, గుమ్మానికి వేలాడదీయండి!" అని మహారాజు గోంద్రించాడు.

రాజవైద్యుడు నిదానంగా మణిని పట్టి చూచి "దీని లక్షణాలన్నీ సరిగానే కనబడు

'నాగేంద్ర'



తున్నయి. ఇది నిజంగా మహేంద్రమనే. కాని, మీరు దీనికి ప్రయోగించవలసిన మంత్రం మరచిపుంటారు" అన్నాడు.

"అయితే, ఆ మంత్రమేదో జ్ఞాపకం చేసుకొని విడవమనండి" అంటూ మహా రాజు నిస్పృహతో చెప్పి, ప్రాణంమీది ఆశ వదులుకున్నాడు.

దైవాధీనం—అంటే ఇప్పుడు ఎలుగు బంటి—ఎరుకలగూడెంలోకి రాగానే, అంతా కేకలు వేస్తూ బడితెలు పుచ్చుకుని వెంటపడ్డారు. ఆ కేకలకు అదిరిపడి, ఏమిటో చూదామని గుణసుందరి ఇంటిలో నించి ఇవతలకు వచ్చింది.

ఆ ఎలుగుబంటి దీనంగా గుణసుందరి వెనుకకు వచ్చి నక్కింది. "అది మిమ్మల్ని ఏమీ చేయదు. భయపడకండి. మీ దారిని మీరు వెళ్లిపొండి" అని ఆమె గూడెం ప్రజలను వారించి, చేతులారా చేసుకొన్న పాప ఫలానికి మొత్తుకుంటూ ఎలుగు బంటిని లోపలకు తీసుకుపోయింది. పట్టరాని దుఃఖంతో గుణసుందరి ఎలుగు బంటి రూపంలోవున్న భర్త కాళ్లమీద పడి, తెలియక చెసిన ఈ అపరాధానికి క్షమించు మని ప్రార్థించింది.

దైవాధీనం ఎలుగుబంటిగా మారి పోవచ్చు. అతనికి ఈ రూపంలో వాక్కు లేకపోవచ్చు. అయినప్పటికీ అతను సర్వజ్ఞుడాయె. గుణసుందరి మొర విని, దైవాధీనం అక్కడ వున్న శ్రీ రాజరాజేశ్వరీ విగ్రహాన్ని చూపించి, "ఆ తల్లే మనకు దిక్కు. కనుక, ఆమెను ప్రార్థించు" మంటూ సంజ్ఞ చేశాడు. భర్త ఆజ్ఞ తల దాల్చి గుణసుందరి తమ ఇలువేలుపైన దేవికి భక్తితో మ్రొక్కులిడి ప్రార్థించింది.

తన భక్తురాలు, పతిభక్తిపరాయణ అయిన గుణసుందరి చేసే ప్రార్థనలు కైలాసంలో వున్న పార్వతీదేవికి వినపడినై.

కరుణామయి, ఆశ్రితజన పక్షపాతి అయినటువంటి దేవి పరమేశ్వరునితో ఈ సంగతిచెప్పి గుణసుందరిని అనుగ్రహించవలసిందని వేగిరపెట్టింది.

ప్రియసతి అయిన పార్వతి మనవిని పరమేశ్వరుడు ఎప్పుడైనా కాదనగలడా? వెంటనే ఆ దంపతులు కిరాతదంపతులయి గుణసుందరి ఇంటిముందు అవతరించారు.

ఆ ఇంటికి వెళ్లి తలుపు తోసుకొని "కొంచెం బిచ్చం పెటే చిట్టితల్లీ" అని వారు అడిగారు. వారినిచూచి గుణసుందరి తన నిర్భాగ్యత్వానికి చింతిస్తూ, బొట బొట కన్నీరు రాల్చింది. అప్పుడు ఆ కిరాత దంపతులు గుణసుందరిని ఓదార్చి, "చిట్టి తల్లీ! నీ విచారానికి కారణం మాకు తెలుసు. నువు అలా విచారించవలసిన పని ఏమీ లేదు. నీతో వున్న ఆ ఎలుగు బంటిని మాకు ఇచ్చివేయి. దానిని ఆట లాడించి ఐశ్వర్యం సంపాదించుకు వస్తాము" అన్నారు.

ఈ వింతకోరిక వినేవరకు గుణసుందరి బిత్తరపోయింది. ఆమె బిత్తరపాటు చూచి దివ్యుల్ని గుర్తించిన ఎలుగుబంటి, వారి వెంట వెళ్లటానికి సిద్ధపడింది. ఈ వాలక




మంతా కనిపెట్టిన గుణసుందరి, "మీరు నా మొరాలింపవచ్చిన పుణ్యాత్ములో; దేవతలో అయివుంటారు. నన్ను కటాక్షించండి!" అంటూ ఆ కిరాతదంపతుల కాళ్ల మీద పడ్డది. "నీకు శుభం చేస్తాములే నిశ్చింతగా ఉండు!" అని గుణసుందరిని ఆశీర్వదించి, ఆ కిరాతదంపతులు ఎలుగు బంటిని తీసుకొని బయల్దేరారు.

పార్వతీపరమేశ్వరులు ఆ ఎలుగు బంటిని ఆడించుకొంటూ కోటలో ప్రవేశించారు. ఎలుగుబంటిచేత ఎన్నెన్నో వింత ప్రదర్శనాలు చేయించారు. దివ్యజ్ఞానం గల ఆ ఎలుగుబంటి అభినయించి జోస్యం



చెప్పనారంభించింది. మహేంద్రమణి పలికే ఉపాయంకూడా అది చెప్పగలదని వదంతి వ్యాపించింది.

ఈసంగతి చెవిని బడగానే మంత్రి, సేనాపతులు వెంటనే వచ్చి ఎలుగుబంటినీ కిరాతదంపతులనూ రాజుగారివద్దకు తీసుకువెళ్ళారు.

మణిని పట్టుకవచ్చి ఎదుట పెట్టేవరకు, ఎలుగుబంటి అభినయించింది. 'అది ఏమిటి?' అని అడిగితే, "ఈ రాజును ఏ కూతురు నిజంగా ప్రేమిస్తున్నదో, ఆమె తన మగనితోసహా ముమ్మారు ప్రదక్షిణం చేసిన ట్టయితే మహేంద్రమణి పలుకుతుంది" అని కిరాత దంపతులు ఎలుగుబంటి అభినయానికి అర్థం చెప్పారు.

"ఒకరేమిటి, ఇద్దరం ఉన్నాము" అంటూ, రూపా హేమలు తమతమ భర్తలను వెంట బెట్టుకుని, మడికట్టుకువచ్చి మణిచుట్టూ ముమ్మారు ప్రదక్షిణంచేశారు. వారు ఎంతసేపు తిరిగినా మణిపలకలేదు.

"ఏమో అనుకున్నాము. నిజంగానే, ఏ రాయో చేత పట్టుకవచ్చి, మా పరువు కూడా తీసివేశారు వీళ్లు" అని రూపా హేమలు తమ భర్తలను ఆడిపోసి, వాళ్ళ పైన మెటికలు విరిచారు. మహారాజు మళ్లీ నిస్పృహలో పడ్డాడు.

ఎలుగుబంటి మళ్లీ అభినయించింది. 'అదేమిటి?' అని అడిగితే, భోరుభోరుమంటూ, "ఊరి చివరను నీ చిన్నకూతురు ఉన్నది. ఆమెవచ్చి ప్రదక్షిణం చేస్తే మణి తప్పక పలుకుతుంది" అంటూ కిరాత దంపతులు అర్థం చెప్పారు. వెంటనే మంత్రీ, సేనాదేవీ వెళ్లి గూడెంలోవున్న గుణసుందరిని వెంటబెట్టుకు వచ్చారు.

కోటలోకి వచ్చీ రావడంతోనే, గుణసుందరి తండ్రిమీద పడి, గోడుగోడున ఏడ్చింది. "చిట్టితల్లీ!—నీకు నేనెంత

అన్యాయం చేసినప్పటికీ, నీకు నామీది అభిమానం కొంచెమైనా తగ్గలేదు. ఇదే నాకు పదివే" లంటూ మహారాజు గుణసుందరిని చేరదీసుకొని, అక్కున అదుముకొన్నాడు.

అక్కడ సమావేశమైన ప్రజలందరూ ఏమవుతుందో చూదామనే ఆత్రంతో, గుణసుందరిని ముందు మణిచుట్టూ ప్రదక్షిణం చేయమని వేగిరపెట్టారు. ఆమె అందుకు సిద్ధపడేసరికి, "చిట్టితల్లీ!—నువు నీ పతితో కలసి ప్రదక్షిణం చేయాలి" అన్నది పార్వతీదేవి.

"నా భర్త దురదృష్టవశాత్తు ఎలుగుబంటిగా మారిపోయారు. మీ రెవరో పుణ్యాత్ముల్లాగా కనబడుతున్నారు. దయఉంచి నా భర్త శాపవిమోచనమార్గం సెలవియ్యండి" అంటూ గుణసుందరి దేవిని ప్రార్థించింది.

"అయ్యో! ఏమిటీ, దైవాధీనం పాపం, ఎలుగుబంటి ఐపోయాడా?" అని అందరూ ఆశ్చర్యపడ్డారు. అప్పుడు పార్వతి "అసలు ఈ మణిని సాధించుకువచ్చింది ఎవరో నిజం చెప్పినట్లైతే, నీ భర్తకు యథారూపం వచ్చేస్తుంది. ఇదుగో చూడు" అంటూ, ఎలుగుబంటికి చెంగోలు అందించింది.




ఆ చెంగోలు తీసుకొని ఎలుగుబంటి, హరమతినీ కాలమతినీ బాది విడిచిపెట్టింది. చెంగోలు దెబ్బలు పడలేక వాళ్లు "బాబోయి క్షమించండి. మణిని సాధించింది దైవాధీనమే" అని నిజంచెప్పివేసి, "క్షమించు", మంటూ ఎలుగుబంటి కాళ్లమీద పడ్డారు.

ఆ చెంగోలు తీసుకుని, పార్వతి రూపాహేమలనుకూడా అదిలించింది.

వాళ్లు నేరం ఒప్పుకొని, "చెల్లాయీ! క్షమించవా?" అంటూ గుణసుందరి కాళ్లమీద పడ్డారు.

అప్పుడు, కిరాత దంపతుల ఆనతితో ఎలుగుబంటి ఎప్పటి దైవాధీనంగా మారి

పోయాడు. మహారాజు కిరాతదంపతులు ఫలానా అని గ్రహించి, వారికి నమస్కరించాడు. గుణసుందరీ, దైవాధీనం కలసి, ప్రదక్షిణం చేసిన వెంటనే మహేంద్రమణి ధగధగ మెరసింది.

"రాజా, నిన్ను నిజంగా ప్రేమించేవారు ఎవరో, మోసకత్తెలెవరో ఇప్పుడైనా తెలుసుకొన్నావా?" అని పార్వతీదేవి రాజును హెచ్చరించింది. గుణసుందరి మణిచేత తండ్రిని స్పృశించిన తక్షణమే, మహారాజు వ్యాధి ఎక్కడిదక్కడనే మాయమై పూర్తి స్వస్థత చేకూరింది.

అప్పుడాయన గుణసుందరిని దగ్గరకు తీసుకొని, "తల్లీ! నీ మహిమ తెలుసుకోలేక పోయాను. నీవూ, నీ భర్తే నన్ను ప్రేమించారు. కనుక, నా రాజ్యానికి మిమ్మల్నే పట్టాభిషిక్తుల జేస్తాను" అని చెబుతూ వెంటనే దైవాధీనానికి పట్టం కట్టాడు.

అంతా సంతోషించారు. కాని మహారాజు గుణసుందరిని చూచి, "ఈ వృద్ధుణ్ణి నీ మెడకు కట్టి నేను నీకుచేసిన అన్యాయం మాత్రం ఇంకా మిగిలిపోయిందే" అని విచారించాడు. అప్పుడు, పార్వతీదేవి "ఓ రాజా ఇంకా నీకు అహంకారం చావలేదు. చిట్టి తల్లికి పరమేశ్వరు డనుగ్రహించిన అభర్త ఎవరో చూడు" అంటూ, దైవాధీనాన్ని ఇక నిజరూపంలో బయల్పడమని శాసించింది. అప్పుడు దైవాధీనం భువన మోహన సౌందర్యంతో వీరసేనకుమారుడై వెలయగా అందరూ ఆశ్చర్యచకితులై ఆనందించారు. పరమానందభరితుడై, మహారాజు, నిజంగా మీరు 'దేవత' లంటూ ఎరుకదంపతులకు ప్రణమిల్లాడు.

అంతా సంతోషంతో స్తోత్రం చేయగా అందరినీ దీవిస్తూ, శ్రీ పార్వతీపరమేశ్వరులు అంతర్ధానమైనారు. [అయిపోయింది]






ఒక వూరిలో వక్రుడు, ఉగ్రుడు అని ఇద్దరు అన్నాదమ్ములు ఉండేవారు. వారు నివసించే వూరికి, మూడువందల మైళ్ళ దూరంలో ఒక కొండ ఉన్నదనీ, ఆ కొండలో బంగారం ఉన్నదనీ తెలిసింది. బంగారం అంటే ఎవరికైనా ఆశే కదా!

"భేష్, బాగా వున్నది తమ్ముడూ! మన వెంట కొంతమంది కూలీలను తీసుకువెళ్లి, అక్కడ వున్న ఆ బంగారమంతా తెచ్చుకుందాము. ఎలా అయినా శ్రమపడి ఒక్క మణుగు బంగారం తెచ్చుకున్నామంటే, మనం ఇద్దరమూ ఆజన్మాంతమూ హాయిగా కాలిమీద కాలు వేసుకొని కాలక్షేపం చేయవచ్చు," అని వక్రుడు చిన్నవాడికి ఆశపెట్టాడు.

కష్టం లేకుండా, తేరగా దొరికితే అనుభవిద్దామని చూస్తూంటాడు వక్రుడు ఎప్పుడూ. అందుకనే, సునాయాసంగా బంగారం దొరుకుతుందని వినేసరికల్లా అతను ఆశ పడ్డాడు. కాని తమ్ముని ఉద్దేశం వేరు. ఈ కారణంచేతనే, కొండమీది బంగారమును గురించి తన అన్న అంతగా ఆత్రపడి చెప్పినా, ఉగ్రుడు ఎక్కువ ఉత్సాహం చూపలేదు. అయినప్పటికీ, పెద్దవానిమాట జవదాటడం ఇష్టంలేక వక్రునితో ఉగ్రుడు "సరే అన్నయ్యా, అలాగే వెళ్లి తెచ్చుకుందాములే" అని తన సమ్మతి తెలిపాడు.

వక్రుడు కొంతసొమ్ము చేతపుచ్చుకొని, కూలీజట్టుని వెంటబెట్టుకొని, మజిలీలు చేసుకొంటూ, ఇంచుమించు ఒక నెల రోజులకు ఆ పర్వతం చేరుకొన్నాడు.

ఆత్రంతో వున్న అన్నగారు, కూలీలతో సహా గబగబ కొండ ఎక్కి, వెంటనే తవ్వ పని ప్రారంభించాడు. తమ్ముడు మాత్రం అతనితో వెళ్ళక, "అన్నయ్యా!— అందరమూ కొండపైన కూర్చుని చేసేదేమున్నది?

జె. కృష్ణన్, కోడంబాకం




నీవు పని పూర్తిచేసుకొని వచ్చేవరకు నేను ఇక్కడనే వుండి కాపలా కాస్తాను" అనే వరకు, వక్రుడు సరేనన్నాడు.

ఉక్రుడు, కొండదిగువనున్న ఆ గ్రామ స్థులను మంచి చేసికొని, చిన్న నివాసం ఏర్పరచుకొన్నాడు. కొద్ది రోజులకల్లా తను వారిమధ్యను తలలో నాలుకగా మసులు కొంటూ వుండటంచేత, వారు ఉక్రుని కోరిక లన్నీ కాదనకుండా తీరుస్తూ వచ్చారు.

కొంతకాలమైన తరువాత ఉక్రుడు అవూరి మునసబు వద్దకు వెళ్ళి "అయ్యా! నేను ఇలా వ్యర్థంగా కాలం గడపడం బాగులేదు. కనుక, మీద్వారా నాకు ఏదైనా పొలం కౌలుకు ఏర్పాటు చేయించండి. పంట పండగానే ఋణాలు తీర్మానం చేసు కొంటాను." అని కోరేవరకు, గ్రామ మునసబు సంతోషంతో అతనికి మూడు ఎకరముల నేలా, అది సాగుచేయటానికి అవసరమైన పరికరములూ, ధనమూ, పరి వారమూ అన్నీ సమకూర్చి పెట్టాడు.

ఈ విధంగా తనకు లభించిన సాయ ముతో ఉక్రుడు కష్టపడి పొలం సాగుచేసి పండించాడు. అతనికి దైవసాయము తోడు పడటంచేత, పంట బాగా పండింది. వ్యవ సాయఖర్చులు, మునసబు పెట్టిన మదుపు పోను నికరంగా పాతిక బస్తాల ధాన్యం ఉక్రునివంతుకు మిగిలింది.

ఉక్రుడు ఇలా కష్టపడి బాగుపడి నందుకు ఆ గ్రామస్థు లందరూ సంతో షించారు. అతను, తనవంతు ధాన్యమును మునసబు ఇచ్చిన ఒక చిన్న గుడిసెలో దాచుకొని, కులాసాగా కాలం గడుపు తున్నాడు. ఆతను పంటపండించి, ధాన్యం నిలవ వేసుకొనేవరకు సుమారు ఆరు మాసముల కాలం పట్టింది.

కూలీలతోసహా మరికొద్దిరోజులకే అతని అన్న వక్రుడు కొండదిగి వచ్చాడు. వారి

స్థితి ఎలా వున్నదంటే — తెచ్చుకొన్న సొమ్ము అంతా కర్చయి పోయింది. ఆహార పదార్థములన్నీ అయిపోయినయి. ఒక్క అడుగైనా ముందుకు పడక, వారందరూ ఆకలిదప్పులతో శోషకొట్టి పోయినారు. ఈ ఆరు నెలలలోనూ కూలీల సహాయంతో వక్రుడు సంపాదించుకొని వచ్చిన బంగారపు పెళ్ళలుమాత్రమే, అతనిదగ్గర ఇప్పుడు మిగిలి ఉన్నవి. కాని, కడుపుకి తిందామంటే చారెడు ధాన్యపుగింజలైనా చేతిలోలేవు.

వక్రుడూ, అతని వెంటనున్న కూలీలూ ఆకలితో అలమటించి పోతున్నారు. కాని, ఈ పల్లెటూరిలో వీరినందరునూ ఆదరించే వారెవరు? వక్రునివద్ద బంగారము ఉన్న మాట నిజమే. కాని, ఈ సమయంలో ఈ పల్లెటూరిలో అదేమన్నా కూడు పెడుతుందా? అదనుకు అక్కర వస్తుందా?

వక్రుడు దిగివస్తూనే, దాపరికం లేకుండా తన అవస్థ తమ్మునికి తెలుపుకొన్నాడు. అది విని ఉక్రుడు "అన్నయ్యా! అందరకూ ఈ గ్రామంలో అన్నం దొరుకుతుంది. కాని, భోజనం పెట్టినందుకు గ్రామస్థులు తలకొక బంగారు పెళ్ళ చొప్పున పుచ్చు




కొంటారు" అని చెప్పేవరకు, వక్రుడు ఉగ్రుడైపోయినాడు. తమ్ముడు గ్రామస్థులతో కలసి, తను కష్టపడి సంపాదించుకు వచ్చిన బంగారం కాస్తా కాజెయ్యటానికి ఈ వ్యూహం పన్ని వుంటాడని అతనికి అపోహ కలిగింది.

ఈ అపోహతోనూ, కోపంతోనూ వక్రుడు ఆవేశ పూరితుడై, బస్తాలోని బంగారు పెళ్లల నన్నిటినీ అక్కడ కుమ్మరించి "సరే తమ్ముడూ!—మావద్దవున్న సొమ్ము ఇదే. దీనిని గ్రామస్థులకు ఇచ్చి, మాకు ముందు తిండి ఏర్పాటు చేయించు. ఇంతకంటె ఏమి చేయగలం? ఏదో విధంగా

ప్రాణాలు నిలబడితే, తరువాత మాట చూసుకోవచ్చు" అని నిస్పృహతో ఇష్టం వచ్చినట్టు మాట్లాడాడు.

వెంటనే ఉగ్రుడు తన కుటీరంలో దాచుకొన్న బియ్యము తీసి, పేదరాసి పెద్దమ్మను రప్పించాడు. వక్రుడూ, కూలీలూ శుభ్రంగా స్నానం చేసుకువచ్చే టంతలో, పంచభక్ష్య పరమాన్నములతో వంట సిద్ధమైంది. ఆరు నెలలనించి ఇటువంటి తిండికి మొగము వాచిన వక్రుడూ, కూలీలూ ఈ భోజనం వరప్రసాదముగా భావించారు.

భోజనము లవుతున్నప్పుడు ఉగ్రుడు తన సంగతి సందర్భాలన్నీ చెప్పేవరకు అన్నగారు ఆశ్చర్యపోయాడు. తరువాత ఆ బంగారపు పెళ్లలన్నీ అన్నకు తిరుగా ఇచ్చివేస్తూ, "అన్నయ్యా! అనవసరంగా నీవు నాపైన అపోహ పడ్డావు కాని, నీసొత్తు నాకు చీపురు ముల్లయినా అక్కరలేదు. నా రెక్కలు చల్లగావుంటే అదే పదివేలు;" అనగానే వక్రుడు తన దురహంకారానికి తనే పశ్చాత్తాపపడ్డాడు.

"తమ్ముడూ — నేను బంగారంకోసం ఆశపడి అనవసరంగా కాలం వృథాచేశాను. అవేకాలంలో నీవు నల్లబంగారమనే నేలను పండించి, హాయిగా నువు తిని పదిమందిని పోషించ గలిగావు. నిజానికి ప్రజ్ఞ అంటే నీదే ప్రజ్ఞ" అని చెప్పి అనేకవిధాల మెచ్చుకొన్నాడు.

అప్పుడు అన్నా దమ్ము లిద్దరూ ఇంటికి వెళ్లిపోయి, ఖాళీగా పడివున్న బంజరులను ప్రభుత్వంవద్దనించి కౌలుకు తీసికొని పండించ నారంభించారు. కాయకష్టంవల్ల కలిగే లాభాలను, వాటి విలువనూ తమ్ముడు చేసిచూపిన పాఠంవల్ల వక్రుడు గ్రహించి అవలంబించాడు. నాటినించీ వారు పేరొందిన రైతుబిడ్డలై, రాణించి, గొప్ప ఐశ్వర్యవంతు లైనారు.






వేములవాడ అనే గ్రామంలో వెంకటప్ప అనే కరణం ఉండేవాడు. ఆయనకి అచ్చమ్మ అనే భార్య ఉండేది. అచ్చమ్మ ఉత్తి అమాయకురాలు. లోకజ్ఞానంలేని వెఱ్ఱిబాగుల మనిషి.

అమాయకపు అచ్చమ్మకి పిల్లలులేరు. "ఏమమ్మా మీకు పిల్లలులేరా?" అని ఒక నాడు ఎవరో ఆవిణ్ణి అడిగేరు. ఆ ప్రశ్నకి ఆవిడ జవాబుచెప్పలేకపోయింది. అందరికీ పిల్లలున్నప్పుడు తనకిమాత్రం ఎందుకు ఉండరూ అనుకుంది. ఐనా భర్తని అడిగి అనుమానం తీర్చుకోవచ్చుకదా అని తలచింది. గ్రామంలో పొలాలన్నీ అజమాయిషీ చేసుకుని, సరిగ్గా మూడు ఝాముల వేళకి వెంకటప్ప ఇంటికి వచ్చాడు. ఆకలిచేత త్వరగా మడికట్టుకవచ్చి, "వడ్డన చెయ్యి" అన్నాడు. అప్పుడు అచ్చమ్మ "ఏమండీ మనకి పిల్లలు లేరా?" అని అడిగింది.

"లేరు...వడ్డించు." అన్నాడు భర్త.

అచ్చమ్మకి అనుమానంతీరలేదు. ఆవిడ అలాగే నిలబడిపోయి, "ఒక్క ఆడపిల్లైనా లేదుటండీపోనీ?" అంది. "లేదు" అంటే మళ్లీ ఇంకోప్రశ్న వేసి ఆలస్యంచేస్తుందేమో అనితోచి, వెంకటప్ప "లేకేం? ఓ ఆడపిల్ల ఉంది! నాకు త్వరగా భోజనంపెట్టు" అన్నాడు.

"ఎక్కడున్నదండీ?"

"ఎక్కడుంటుంది? అత్తారింట్లో ఉంది!"

"పెళ్లి చేశాకకదండీ అత్తారింటికి పంపడం?"

"ఔను. పెళ్లిచేసే, పంపాను."

"అలాగటండీ? ఐతే మన అల్లుడెవరండీ?"

ఇలా ప్రశ్నమీదప్రశ్న అడుగుతోంటే, వెంకటప్ప, ప్రాణంవిసిగి, "ఎవరా? వల్ల

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మద్రాసు




కాటిలో రామనాథయ్యా" అని సమాధానం చెప్పాడు. అదివిని అచ్చమ్మ, తమఅల్లుడి ఇంటిపేరు వల్లకాటివారనీ, అతగాడిపేరు రామనాథయ్యా అనీ అనుకుని సంతోషించింది. అంతేకాని అలాంటి మనిషి ఎక్కడా ఉండడనీ, తాను మొగుణ్ణి "ఎవడు? ఎవడు?" అని అడిగి విసిగించే సరికి, అతడు "ఎవడో ఒకడు!" అని చెప్పటానికి మారు, "వల్లకాటిలో రామనాథయ్యా!" అన్నాడనీ ఆమెకు తెలీదు. ఎలా తెలుస్తుందీ? ఆవిడకు లోకజ్ఞానం కొంచెమైనా లేదుగా! నాటినుంచీ అచ్చమ్మ తనకొక కూతురుందనీ, తన అల్లుడు వల్లకాటి రామనాథయ్యా అనీ సంబరపడుతూ వుండేది.

కొన్నాళ్ళుపోయాక, కరణంగారు జమాబందీకని పట్టణంవెళ్లేరు. అప్పుడు ఒకనాడు మిట్టమధ్యాహ్నమపుడు దారినిపోయే వాడొకడు, దాహంవేసి కరణంగారి ఇంటి ముందు ఆగేడు. కరణంగారు ఊళ్లోలేరు గనక అచ్చమ్మ తలుపులేసుకుని లోపల పప్పురుబ్బుతోంది. "ఎవరండోయ్ లోపల? నాలిక అర్చుకపోతోంది. తలుపుతీసి కాస్త దాహం ఇప్పిస్తారా?" అని బయటగుమ్మం మీద నిలబడ్డ బాటసారి కేకవేశాడు. పట్నం వెళ్లేముందు వెంకటప్ప భార్యతో, "తలుపు వద్ద ఎవరుపిలిచినా, ఎవరో కనుక్కునిగాని తలుపుతియ్యవ"ద్దని చెప్పివెళ్లేడు. అంచేత అచ్చమ్మ రుబ్బురోటిదగ్గిర్నుంచి లేవకుండానే "ఎవరునాయనా, నువు?" అని బాటసారిని అడిగింది. దాహంతో ఓమూల ప్రాణంపోతుంటే ఈ ప్రశ్న ఏమిటని పించింది బాటసారికి. బదులురాకపోవటం వల్ల అచ్చమ్మ "ఎవరునాయనా నువ్వు?" అని మళ్లీ అడిగింది. వాడికిప్రాణంవిసిగి, "ఎవరా? వల్లకాటిలో రామనాథయ్యాని! త్వరగా తలుపుతీసి కాసిన్ని మంచి

నీళ్లిప్పిస్తుండి. ప్రాణంపోతున్నది!" అన్నాడు. "ఎవరు? వల్లకాటిలో రామనాథయ్యవా? మా అల్లుడివా నాయనా?" అంటూ, అచ్చమ్మ ఎగిరి గంతేసి, గబగబా వచ్చి తలుపుతీసింది. కాసిన్ని మంచినీళ్లిస్తే చాలంటూ వచ్చిన బాటసారికి లోపలున్న మానుకుర్చీ వేసి కూచోబెట్టి, చిక్కటి ఆవు మజ్జిగ దాహమిచ్చింది. దాహంతీరి కడుపు చల్లపడ్డాక బాటసారిలేచి, "అమ్మా, సెలవు మరి" అని వెళ్ళబోయాడు. ఆమాట విని అచ్చమ్మ, "అదేమిటి రామనాథయ్యా, అప్పుడే వెళ్లిపోతానంటావ్? అల్లుడవు, రాకరాకవచ్చావాయిరి. ఉండు. మామగారు ఊళ్లో లేనప్పు డొచ్చావు. ఆయన రాకుండా వెళ్లిపోతావా? ఇంతకీ మా అమ్మాయి సంగతే చెప్పేవుకావు" అంటూ మొదలెట్టింది.

ఈ మాటలకు ఆ వచ్చినవాడు నిర్ఘాంత పోయాడు. "ఇదేమిటి, నన్ను ఈవిడ అల్లుడంటూవుంది! నాకు దాహానికి ఇవ్వ లేదని ప్రాణం విసిగి 'నాకు పేరేమిటమ్మా, వల్లకాటిలో రామనాథయ్యను' అని యదా లాపంగా అనేవరకు, ఆ మాట నిజమే అని ఈవిడ నమ్మినట్టుంది. బహుశా ఈ యింటి వారి అల్లుడిపేరు రామనాథయ్యా అయి



వుండాలి. లేకపోతే ఈ పేరు చెప్పగానే నన్ను ఇంతగా మర్యాదచేయడ మేమిటి? ఇదంతా చూడగా తమాషాగానే వుంది," అనుకొన్నాడు.

అయినా, ఆ యిల్లాలు తన కూతురును గురించిన క్షేమవార్తలు అడిగినప్పుడు ఏదో ఒక తృప్తికరమైన సమాధానం చెప్పకపోతే బాగుండదుగద! అందుచేత, అతను ఎందుకయినా మంచిదని "మీ అమ్మాయి కులాసాగానే వుంది" అని చెప్పాడు.

అవిడ సంతోషించి, "ఒక్క క్షణంలో వస్తా"నని చెప్పి లోపలికివెళ్లి, మినప్పప్పు గబగబా రుబ్బేసి, అల్లుడికోసమని గారెలు

తయారుచేసి పట్టుకొచ్చింది. అవతల మునిగిపోయేపని ఏమిలేదుగనుక ఆవచ్చిన వాడు తాపీగాకూర్చుని గారెలన్నీ తిన్నాడు. చెయ్యి కడుక్కుని "ఇంక నేను వెడతానండి" అన్నాడు. "ఆయన రేపో, ఎల్లుండో వచ్చేస్తారు. వెడుదువుగానిలే బాబూ!" అన్నది అచ్చమ్మ.

"అలా కాదత్తగారూ!, ఇంటిదగ్గర మీ అమ్మాయి ఒక్కర్తే ఉండలేదు. సాయంత్రానికి ఇంటికి వెళ్లిపోవాలి. అంతేకాకుండా ఎల్లుండి మా మేనమామగారింట పెళ్లి. అక్కడికి మీ అమ్మాయిని తీసుకెళ్లాలి" అన్నాడు.

"ఓహో, అలాగా? తప్పకుండా తీసుకెళ్లు. అమ్మాయి పెళ్లిచూసి సంతోషిస్తుంది."

"సంతోషిస్తుందికాని, అసలు పెళ్లికి మీ అమ్మాయి బయలుదేరటానికే సందేహిస్తోంది."

"ఏం? ఎందుకూ సందేహించడం?"

"ఎందుకేమిటి? పెళ్లికివచ్చినవాళ్ళంతా గంపెడు నగలెట్టుకొస్తారు. మంచి మంచి బెనారసు చీరలు కట్టుకొస్తారు. మీ అమ్మాయికి ఇవేమీ లేవుగా మరి!"

"అయ్యో, ఐతే ఎలామరి!"

"ఎక్కడైనా నగలు ఎరువుతెచ్చుకోమన్నాను. కాని ఎవళ్లూ ఇవ్వనన్నారుట. 'పోనీ, మా అమ్మని అడిగి తెండీ' అని నన్ను పంపింది."

"ఆమాట చెప్పేవు కాదేం నాయనా ఇంతసేపటినించీని? తప్పకుండా పట్టుకెళ్లు. కంటీ, కట్టుకాసులపేరూ, ఒడ్డాణం, దండ కడియాలూ — అన్నీ ఉన్నాయి. మనకేం లోటూ?"

"మళ్లీ, వారం తిరక్కుండా పట్టుకు చక్కా వచ్చేస్తానత్తగారు. వీలైతే పెళ్లి నుంచి వచ్చేటప్పుడు ఈదారినేవస్తాం నేనూ మీ అమ్మాయీని. పట్టు చీరలు కూడా

ఉంటే ఇవ్వండి. విలవైన చీరలమీదగాని బంగారపునగలు రాణించవు."

"అలాగే ఇస్తాను పట్టుకువెళ్లునాయనా! అమ్మాయికంటే మాకు ఎక్కువ, ఎవను? మేము ఏమిచేసినా అమ్మాయికోసమే కద!"

తన నగలూ, పట్టుచీరలూ ఎరువివ్వక పోతే తానెన్నడూ ఎరుగని ఆ కూతురు పెళ్లికి వెళ్లటం ఆగిపోతుం దనిపించి, అచ్చమ్మ లోపలికెళ్ళి పెట్టెతెరచి, ముద్దినుసు నగలూ, చీరలూ తెచ్చి, ఆ అతిథి ముందు పెట్టింది. వాడు తాపీగా నగలూ బట్టలూ తనసంచీలో ఇముడ్చు కుని, "ఇంక వెళతానత్తా. ఇవన్నీ మళ్లీ పువ్వుల్లో పెట్టి తెస్తాను. వారం తిరక్కుండా వచ్చేస్తాను" అంటూ, తన అదృష్టానికి మురిసిపోతూ దారి పట్టాడు.

మర్నాటి సాయంకాలానికి వెంకటప్ప జమాబందీనుంచి తిరిగి వచ్చాడు. అతడు గుమ్మంలో అడుగు పెట్టేడో లేదో అచ్చమ్మ పుట్టెడు సంబరంతో, "ఏమండోయ్, మన అమ్మాయి కులాసాగానే ఉందిట!" అంది.

"మన అమ్మాయా? మనకి అమ్మాయి లేందే?"



"ఆదేమిటలా అంటారు? మన అల్లుడే స్వయంగా వచ్చి, పిల్ల కులాసాగా ఉందని చెపితేనే?"

"అల్లుడా? ఎవడు వాడు?"

"ఎవడేమిటండీ? వల్లకాటి రామ నాథయ్యేనండీ."

అప్పుడు వెంకటప్పకి భార్యతో చెప్పి వున్న 'రామనాథయ్య' మాట జ్ఞాపకానికొచ్చింది. ఎవడో తన వెఱ్ఱిబాగుల పెళ్లాన్ని మోసంచేసినట్టున్నాడని తోచి, "ఏడే వాడు?" అని అడిగేడు.

"వెళ్లిపోయాడండీ. మీరు వచ్చేదాకా ఉండటానికి వీల్లేదన్నాడు. అతనూ, మన

అమ్మాయీ పెళ్లికి వెడుతున్నారుట. నా నగలూ, బట్టలూ ఎరువుతెమ్మని అమ్మాయే అతణ్ణి పంపింది."

"కొంపతీసి ఏమీ ఇవ్వలేదుగదా?"

"అదేమిటండీ? కూతురాయిరి, ఇవ్వక పోతే ఎలా? ఇంతకీ అచ్చంగా ఇచ్చి వేశామా, ఏమన్నానా? ఎరువేగా? వారం తిరక్కుండా తెచ్చేస్తా నన్నాడు అల్లుడు. అందుకని నగలూ, చీరలూ ఇచ్చాను. అన్నట్లు చెప్పటం మరిచిపోయాను. పెళ్ళి నించి ఇంటికి వెళ్లేటప్పుడు అమ్మాయిని కూడా తీసుకొస్తా నన్నాడండీ."

ఆమాట విని వెంకటప్ప 'లబో లబో' మని గుండె బాదుకున్నాడు. 'ఎంత తెలివి తక్కువ పీనుగువే!' అని అచ్చమ్మని తిట్టిపోశాడు. అంతకుమించి చేసేదేముంది?

"నిన్ను తిట్టి ఏం ప్రయోజనం? తప్పంతా నాది! 'మనకి అమ్మాయీలేదు, అల్లుడూలేడ'ని చెప్పక 'వల్లకాటిలో రామ నాథయ్యా మన అల్లుడనటం' నాదేతప్పు. తెలివితక్కువ వెంగళమ్మల ముందు వెటకారానికి పోతే ఇలాగే శాస్తి ఔతుంది" అని ఏడవటం మొదలెట్టేడు.

'అమ్మాయీ లేదు. అల్లుడూ లేడ'ని మొగుడు ఏడుస్తోంటే ఆ మాట అచ్చమ్మకు అర్థంగాక, వాళ్లిద్దరికీ అకాత్తుగా ఏదో ప్రమాదం వచ్చింది కాబోలని ఆమెకూడా ఏడవటం మొదలెట్టింది. దానితో ఊరంతా పోగై, సంగతి తెలుసుకొన్నారు. నగా నట్రా పోయినందుకు ఏడుస్తోన్న వెంకటప్పనీ, లేని కూతురూ అల్లుడూ పోయారనుకుని ఏడుస్తూవున్న అచ్చమ్మనీ ఓదార్చి వాళ్ళు చక్కా పోయారు.

అచ్చమ్మ తెలివితక్కువవల్ల ఇప్పుడు ఎన్ని నష్టాలు వచ్చాయో చూడండి. సంసారం సరిగా నడవాలంటే, ఇల్లాలు లోకజ్ఞానంకలిగి ఉండాలి. అందుకనే స్త్రీలు చక్కగా చదువుకోవాలంటారు.






కైలాసంలో ఒకనాడు మధ్యాహ్నం భోజనాలయాక పార్వతీ, పరమేశ్వరుడూ కూర్చుని తాంబూలం వేసుకుంటున్నారు. విఘ్నేశ్వరునికి భోజనం కొంచెం ఉదాత్తం అవటంవల్ల అయాసంగా ఉండి ఓ తలగడా వేసుకొని వాళ్లమ్మకు దగ్గరగా పడుకుని దొర్లుతున్నాడు. కుమారస్వామి — అంటే విఘ్నేశ్వరుని తమ్ముడూ, పార్వతీ పరమేశ్వరుల రెండోకొడుకూ అన్నమాట— తన అన్నకు మల్లే బద్ధకంగా ఒకచోట కూర్చోక చురుకుగా అటూ ఇటూ ఏదోపని ఉన్నవాడికి మల్లే తిరుగుతున్నాడు. ఆ సమయంలో అక్కడికి ఎక్కడినుంచి వచ్చాడోగాని నారద మహర్షి వీణ మీటుకుంటూవచ్చి ప్రత్యక్షమయ్యాడు. అయన రెండోచేతిలో బంగారానికి మల్లే పచ్చగా మిసమిసలాడిపోతూవున్న పెద్ద మామిడి పండొకటి కనబడింది. ఆటల హడావుడిలో ఉన్న కుమారస్వామి ఆ పండును చూడలేదు గాని నేలమీద అపసోపాలు పడుతూ దొర్లుతూ కూర్చున్న గణపతి పసిగట్టేడు. అయాసమంతా ఏమైపోయిందో గాని గణపతి టువ్వుమని లేచి నారదమహర్షికి ఎదురెళ్లి ఆ పండు అందుకోబోయాడు. అప్పటికి కుమారస్వామికికూడా ఆ పండు సంగతితెలిసి తూఁగలాగా ఎగిరివచ్చి 'నాకో, పండు ?' అన్నాడు. ఆ ఒక్క పండుకోసం అటు విఘ్నేశ్వరుడూ ఇటు కుమారస్వామీ పోట్లాడుకోసాగారు.

ఎవరైనా ఇద్దరు పోట్లాడుకుంటూంటే చూడటం నారదుడికి సరదా. సరదా యేమిటి ? అతనికి పోట్లాట చూస్తూంటే వేరే భోజనమే అక్కర్లేదు. అందుకే అతనికి "కలహ భోజనుడు" అని పేరొచ్చింది. 'కలహం' అంటే పోట్లాట. పోట్లాటే భోజనంగా కలవాడు గనక అతనికా

పి. వెంకమాంబ, మాంబళం



పేరొచ్చింది, అందుచేత, ఈ సమయంలో ఆ అన్నదమ్ము లిద్దరూ ఆ ఒక్క పండు కోసం కొట్లాడుకుంటూ ఉంటే నారదుడికి చాలా సంతోషంగా ఉంది. కాని క్రమంగా ఆ పిల్లల పేచీ చిలికి చిలికి గాలివానఅయి, పండుకోసం వాళ్ళిద్దరూ కొట్టుకుని ఏడవటానికి సిద్ధమయ్యేటప్పటికి, వాళ్లని తాను అలా ఏడిపిస్తున్నందుకు పార్వతికి తనమీద ఎక్కడ కోపం వచ్చిపోతుందో అని భయం వేసి, నారదుడు ఆ కొట్లాట ఏదో విధంగా పరిష్కారం చెయ్యాలని ఆలోచించాడు, "ఏమోయ్ గణపతి! నిన్నేనయ్యా కుమారస్వామి! ఆగండి. దెబ్బలాడుకోకండి.



నేనుతెచ్చింది ఒక్క పండుకదా. మీకిద్దరికీ ఎలాగ ఇవ్వటం? మీలో ఎవరికో ఒకరికే ఇస్తాను మీ ఇద్దర్లో ఎవరైతే పధ్నాలుగు లోకాలూ ఒక్కమాటు చుట్టి ముందుగా ఇక్కడకు వస్తారో వాళ్ళకీ పండు ఇచ్చేస్తాను" అని ఆశపెట్టేడు నారదుడు.

ఆ మాట విని వినటంతోనే కుమారస్వామి తన వాహనం ఐన నెమలి వీపు మీద కెగిరి లోకాలన్నీ ప్రదక్షిణం చేసి రావటానికి వెళ్లిపోయాడు. పాపం గణపతి మాత్రం ఇంకా అక్కడే ఉండిపోయాడు. గణపతికి ఎప్పుడో పెద్దవాడయాక ఒక ఎలుక వాహనం వచ్చినమాట నిజమే గాని మన మామిడిపండు కథనాటికింకా అతనికి ఏ వాహనమూ లేదు. పోనీ ఎవరి వాహనమైనా ఎరువు తీసుకొని ఎక్కి వెళదామన్నా, ఆ పెద్ద బొజ్జ మూలాన్ని స్వారీ చెయ్యటానికి సులువులేక ఆమాట తల పెట్టటానికే వీల్లేకపోయింది. పాపం గణపతికి ఏమీ తోచక అక్కడే చతికిలపడిపోయాడు. పండుమీద మాత్రం ఆశపోక దానివైపే చూస్తూ గుటకలు మింగటం మొదలెట్టేడు. అప్పటికప్పుడె కుమారస్వామి లోకాలన్నీ నాలుగోవంతు దూరం



చుట్టేశాడు. తమ్ముడు రాకుండానే ఎలాగైనా ఆ పండు కొట్టెయ్యాలని గణపతి, ఆలోచన మొదలెట్టేడు. అతనిపాట్ట ఉపాయాల పుట్ట గనక గట్టి ఆలోచన ఒకటి ఇట్టే తట్టింది. "ఇదిరా పని!" అని గణపతి కూర్చున్నచోటునుంచి చటుక్కుని లేచాడు.

ఏంచేస్తాడో చూద్దామని ఇటు నారదుడూ, అటు పార్వతీ పరమేశ్వరులూ రెప్ప వాల్చకుండా చూస్తూ ఉండిపోయారు. గణపతి మాట్లాడకుండా సరాసరి పరమేశ్వరుని దగ్గరకు వెళ్లి ఆయన చుట్టూ ఒకమాటు ప్రదక్షిణం చేసి చక్క వచ్చాడు. "ఏం చెప్మా ఉన్నట్టుండి వీడికి నామీద ఇంత భక్తి పుట్టుకొచ్చింది!" అని పరమేశ్వరుడు ఆశ్చర్యపోతుంటే గణపతి నారదుని దగ్గిరకెళ్లి, "అయ్యా నేను లోకాలన్ని ప్రదక్షిణంచేసి ముందుగా వచ్చాను. ఆ పండు ఇలా తెండి!" అన్నాడు. నారదుడు నిర్ఘాంతపోయి, "నువ్వు ఇక్కడే ఉండి మీ నాన్నచుట్టూ ఓమాటు ప్రదక్షిణంచేస్తే విశ్వప్రదక్షిణం చేసినట్లు ఔతుందా?" అన్నాడు.

"ఎందుకవదు? మా తండ్రి విశ్వానికంతకూ ఈశ్వరుడు గనకనే, ఆయనకి విశ్వేశ్వరు డన్న పేరొచ్చింది. ఆయనకి



ప్రదక్షిణం చేస్తే పధ్నాలుగు లోకాలూ చుట్టి వచ్చినట్లే. ఆలస్యం చెయ్యక పండు ఇలా ఇవ్వండి!" అన్నాడు విఘ్నేశ్వరుడు.

నారదుడు విఘ్నేశ్వరుని యుక్తికి మెచ్చుకుని, మామిడిపండు అతని కిచ్చేశాడు. చేతికి వచ్చీ రావటంతోనే గణపతి ఆపండులో ఉన్న రసం అంతా ఒక్కమాటుగా తొండంతో జుర్రేశాడు. ముగికాస్సేపటికి కుమారస్వామి రొజుకుంటూ వచ్చి నారదుడి కెదురుగా నిలబడి, "పండు! పండు!" అన్నాడు. ఇంకెక్కడి పండు? అప్పటికప్పుడే టెంకకూడా చప్పరించేసి అవతల పారేశాడు గణపతి!




అనగనగా మక్కాదేశంలో అలీ అనే ఒక మంగలి ఉండేవాడు. నలుగురూ వచ్చి పోయే నడివారిలో ఆతను చిన్న క్షవరశాల తెరిచాడు. అయితే —అలీ గడ్డం పిల్లిగడ్డం కావటంచేత, క్షవరంకోసం వచ్చిన సాయిబులందరూ, "వీడిమొఖం, వీడు మనకు క్షవరం చేసేదేమిటి? పని చేయడమే చేతనైతే, ముందు తన గడ్డమే బాగుచేసుకుని వుండును" అనుకొని, నిరసనభావంతో మరొకషాపుకి పోయేవాళ్లు. క్రమంగా, అలీ షాపుకి ఒక్కడూ రావటం మానివేశాడు.

ఇలా వుండగా ఒకరోజున, ఒక ముష్టివాడు అలీవద్దకు వచ్చి ఆకలవుతున్నదన్నాడు. అలీ వాడిని ఆదరించి, కలిగినంతలో భోజనం పెట్టడమే గాకుండా, ఒంటిమీద వేసుకునేందుకు అడగకనే చిన్న తువాలుగుడ్డకూడా ఇచ్చాడు.

ముష్టివాడు సంతోషించి, 'అబ్బాయీ, నీకేమి కావాలో కోరుకో' మన్నాడు. అందుకు అలీ "తాతా, తాతా! —నాగడ్డం పిల్లిగడ్డం కావటంచేత అందరూ నన్ను చూచి అసహ్యించుకొంటున్నారు. అందువల్ల నామంగలి వృత్తి మందగించి, బతుకు తెరవుకు ఇబ్బందిగా వుంటున్నది. అందమైన ఒక మూరెడు గడ్డం ప్రసాదించావంటే, ఖాతాదారులు మళ్లీ వచ్చి వ్యాపారం బాగా సాగుతుంది. అప్పుడు నా జీవనం చక్కగా జరిగిపోతుంది..." అని, మనస్సులో కోరికను వెల్లడించాడు.

అప్పుడు ముష్టివాడు తన చింకికోటులో చెయి పెట్టి, ఒక పాత్ర తీసి ఇస్తూ, "అబ్బాయీ!— ఈ పాత్ర నీకోరిక నెరవేరుస్తుంది. నీ కోరికమాత్రమేగాని ఇతరుల కోరిక నెరవేరదుసుమా" అనిచెప్పి అదృశ్యమైపోయాడు.

ఆర్. రఘునాథరెడ్డి, అనంతపురం



తరువాత అలీ ఆపాత్ర తీసిచూడగా, దానినిండా పగుళ్లు కనపడినై. "ముష్టి వెధవ టక్కరిచేసి, నాకీ పనికిరాని పాత్ర అంటగట్టి పోయాడు" అనుకొంటూ, దానిని అవతల గిరవాటు వేదామను కొనేవరకు, దానిపైన—

"కోరిన కోరిక తీర్చే...

చిత్రమైన అక్షయపాత్ర!"

అని అక్షరాలు రాసివున్నయి. ఈ అక్షరాలు చూడగానే, అలీ మనస్సు మారిపోయింది. "వీడు మామూలు ముష్టివాడు కాదుకాబోలు. మహిమలు తెలిసిన వానిలాగా కనపడుతున్నాడు" అనుకొని, ఆ పాత్రను శుభ్రపరచి, ఒకచోట జాగ్రత్త పెట్టాడు.

ఒకనాడు అందులో నీళ్లుపోయడంతోనే, అవి కుత కుత ఉడికి, పొగలూ ఆవిరీ బయల్దేరి, గది అంతా కమ్మేసింది. అలీకి ఊపిరాడక, బయటకు వెళ్ళిపోదామను కొనేవరకు, ఆ పాత్రలోనుంచి చిత్రమైన మనిషి వచ్చి ప్రత్యక్ష మయ్యాడు. ఆ మనిషికి సింహంతల, పొడుగుపాటి జూలు, చిలుకముక్కు, శరీరమంతా కోతి శరీరం!—

ఇటువంటి చిత్రమైన మనిషి వచ్చి "నీకేమి కావాలో కోరుకో" మనేసరికి అలీ," తాతా, తాతా!— నాగడ్డం పిల్లిగడ్డం కావటంచేత అందరూ నన్ను చూచి అసహ్యించుకుంటున్నారు. అందువల్ల నా మంగలివృత్తి మందగించి, బతుకుతెరవుకు ఇబ్బందిగా ఉంటున్నది, అందమైన ఒక మూరెడు గెడ్డం ప్రసాదించినావంటే, కాతాదారులు మళ్లీ వచ్చి, వ్యాపారం బాగా సాగుతుంది. అప్పుడు నాజీవనం చక్కగా జరిగిపోతుంది..." అని కోరాడు.

అంతట చిత్రమైన మనిషి అంతర్ధానమైపోయాడు. పొగలూ, ఆవిరీ, పాత్రలోని



నీళ్ళూ మాయమైపోయినై. మరి కొంచెం సేపటికల్లా అతని కోరికప్రకారం, పిల్లిగడ్డం పోయి, అందమైన ఒక మూరెడు గెడ్డం మొలిచింది!

ఒక్క రాత్రిలో అలీకి అందమైన మూరెడు గెడ్డం మొలిచిందనే వార్త పొక్కడంతోనే, ఊరిలో సాయిబులందరూ అలీ షాపుకి వచ్చి, తమ గడ్డాలుకూడా సరీగా అతని గెడ్డంమోస్తరుగా కత్తిరించి తయారు చేయమంటూ కూర్చున్నారు. దెబ్బతో అలీకి దశ తిరిగి, మంచిరోజులు వచ్చాయి. షాపు పట్టకుండా కాతాదారులు రాసాగారు. వ్యాపారం వృద్ధిపొంది, అలీకి జీవనం చక్కగా జరిగిపోతున్నది. పైగా అతని పేరుకూడా మ్రోగిపోయింది.

కొంతకాల మయేసరికి, ఈ రకం గెడ్డంతో ప్రజలకు విసుగెత్తిపోయింది. మళ్లీ అలీ వృత్తి మందగించింది. ఐతేనేం?— తనవద్ద 'కోరికతీర్చే అక్షయపాత్ర' ఉన్నదిగా ఇప్పుడు?

మళ్లీ రెండోసారి పాత్రలో నీళ్లు పోసి, చిత్రమైన మనిషిని ప్రత్యక్షం చేసుకొన్నాడు అలీ. ఈసారి, మునుపటి కంటె అందమైనదీ మోకాళ్లవరకూ వేలాడేది వెండి వెట్రుకలతో మెరిసిపోయేదీ గెడ్డం కోరుకున్నాడు. ఆప్రకారమే జరిగింది.

ఈ విడ్డూరం ఊరిలో అల్లుకోగానే ఇంకోసారి సాయిబు లందరూ అలీ షాపులో, విరగబడి, "ఇటువంటి కొత్తరకం గెడ్డం మాకూ కావాలి" అంటూ కూర్చున్నారు. ఈసారి అలీ షాపుకి కాతాదారులు తిరిగి రావటమూ, అతని పేరు మోగిపోవటమూ మాత్రమే కాదు. ఈవార్త సరాసరి పాదుషా చెవిని పడింది!

"ఓహో, బాగావున్నది. మనరాజ్యంలో వెండి గెడ్డపువాడు ఉన్నాడంటే ఎంత గొప్ప!" అంటూ అలీని గురించి పాదుషా

మెచ్చుకుంటూ వుండగా, చాటునవుండి ఫాదుషా కుమార్తె ఆమాటలు విన్నది. "నాన్నగారూ!— మరైతే, నేను వెండి గెడ్డపు వాడిని పెళ్లాడుతాను" అన్నది.

గొప్పకోసం ఫాదుషా, "అమ్మాయీ! నీకేమిటి, వెండి గడ్డపువాడు భర్త యేమిటి? బంగారు గెడ్డపువాడిని తెప్పించి నీకు పెళ్లి చేస్తా, చూచుకో" అని బడాయికొట్టాడు.

కోటలో పనివాడు ఒకడు ఈ సంభాషణ అంతా మోసుకుపోయి, ఆలీకి చెప్పేశాడు. పట్టరాని ఉత్సాహంతో, ఆలీ చిత్రమైన మనిషిని రప్పించి, కోరికను తెలియబరిచాడు. ఈసారి అతనికి ధగ ధగమెరిసే బంగారు గెడ్డం మడమలవరకూ వేలాడుతూ, ఒక కొత్తరూపం వచ్చేసింది.

మరునాడు ఆలీ ముస్తాబై, కోటకు చేరేసరికి, అందరూ అతనిని వింతగా చూచారు. ఆలీ వచ్చిన సంగతి ఫాదుషాకు తెలియగానే, తన వాగ్దానం ప్రకారం అతనికి కూతురునిచ్చి పెళ్లిచేయక తప్పిందికాదు.

ఇలా ఉండగా — ఒకరోజున ఫాదుషా ఆలీని పిలిచి, 'ఏమోయి ఆలీ!—బంగారు గెడ్డంపైన నాకు సరదా పుట్టింది. రేపు ఉదయంలోగా, నీగడ్డం మోస్తను గెడ్డం



నాకు వచ్చేటట్టు చేయాలి. లేకపోతే, నీపని ఏం జరుగుతుందో ఆలోచించుకో!' అని ఆజ్ఞాపూర్వకంగా చెప్పాడు.

వెంటనే ఆలీ తనపాత్రలో నీళ్లుపోసి, చిత్రమైన మనిషిని రప్పించి ఫాదుషా, కోరిక తెలియజెప్పాడు. అందుకు చిత్రమైన మనిషి "ఇది నీకోరిక కాదు. నేను నెరవేర్చను" అంటూ, అదృశ్యమైపోయాడు.

ఇక ఎలాగా ఫాదుషా తన తలకొట్టించి కోట గుమ్మానికి వేలాడదీయిస్తాడని ఆలీకి భయం పట్టుకొన్నది. ఆకంగారులో ఆలీ, తన అక్షయపాత్రను స్నానపుగదిలో దాచి, మళ్లీ తీసుకోవటం మరచిపోయాడు.

ఇంతలో రాజకుమారి స్నానపు గదిలోకి వచ్చిచూడగా, పగిలిన పాత్ర ఆమె కంటికి కనపడింది. దానినిచూచి చీదరించుకొని, ఆమె కిటికిలోనుంచి విసరివేసింది.

సరీగా అదే సమయంలో, విరక్తి చెందిన అలీ ఆదారిని వస్తూ, తన మహిమగల పాత్ర కింద పడబోవటం చూశాడు. ఆత్రంతో పరుగెత్తుకుపోయి, అది ఎలాఐనా పడిపోకుండా పట్టుకోవాలని ప్రయత్నించాడు. అలీ ఎంత యత్నించినప్పటికీ, ఆ పాత్ర తప్పిపోయి, అలీ కాళ్లదగ్గరనే పడి, ఎన్ని పగుళ్లున్నయో అన్ని ముక్కలైంది.

ఆ ముక్కలలోనించి పొగలూ, ఆవిరీ బయల్దేరి, ఆప్రదేశమంతా కమ్మేసింది. అందులోనించి చిత్రమయిన మనిషి ఆఖరుసారి ప్రత్యక్షమై, మరెన్నడూ కనపడనని చెప్పి అంతర్ధానమైపోయాడు!

అక్షయపాత్ర తన అధీనంలోనించి పోగానే, అలీగడ్డం తడిమి చూచుకొనే వరకు, మళ్లీ తన పిల్లిగెడ్డమే తయారై కూచుంది.

నిమిషమైనా అక్కడ నిలవకుండా, అలీ కాలికొద్దీ పరుగుచ్చుకొన్నాడు. పోయి పోయి, ఇన్నాళ్లనించీ ఖాళీగావున్న తన క్షవరశాలకి చేరుకొన్నాడు. గబ గబ తలుపులుతెరచి, ఒంటిమీదఉన్న రాజదుస్తులు ఒకమూల పడవేసి కూర్చున్నాడు.

చాలా కాలానికి మళ్లీ కంటబడిన అలీని చూచి సంతోషించి. సాయిబులందరూ పలకరించారు. ఎప్పటిలాగా అతని వృత్తి సాగిపోతూనే వుంది.

అయితే,—తన ఆజ్ఞ నెరవేర్చని అలీని తలతీయించి కోటగుమ్మానికి కట్టించాలని ఫాదుషా ఇప్పటికీ పంతం పట్టే వున్నాడు. అయినా, ఆ షాపు పక్కనించి వస్తూ పోతూ వున్నప్పటికీ, ఆ పిల్లిగెడ్డపు అలీ తన అల్లుడే అన్నసంగతి కనిపెట్టనేలేక పోయాడు!






ఒక పేదవాడు రోజూ అడవికిపోయి, కలప కొట్టి తెచ్చి, అది పట్టణంలో అమ్ముకొని పొట్టపోసుకుంటూ ఉండేవాడు. అతను ఎంతశ్రమపడినా, రోజుకి మూడణాలకంటె ఎక్కువ రాబడి వచ్చేదికాదు. ఆ మూడ ణాల డబ్బులతో కుటుంబపోషణ జరగక పోయేసరకు, వానికి విరక్తి తోచింది.

చివరకు ఒకనాడు, ఆ స్థలం విడిచి పోవాలని నిశ్చయించి, అతను ఒక నాటు దారి పట్టాడు. పోగాపోగా, కొంతసేపటికి అతనికి ఆకలివేసింది. కాని చేతిలో పైసా లేకపోతే, ఎవరు ఆదరిస్తారు?

మరికొంతదూరం పోయేసరికి, ఒక మైదానం కనపడింది. ఆ మైదానంలో కొంతమంది సిపాయీలు కవాతు చేస్తూ,

"బుధవారం— కాదు, గురువారం.
గురువారం— కాదు, బుధవారం.
రైట్—లెఫ్ట్—రైట్—లెఫ్ట్"

అని అడుగులు వేస్తున్నారు. కట్టెలవాడు వాళ్ళ కవాతు అబ్బురంగా చూస్తూ, నిలబడిపోయాడు.

కొంతసేపటికి సిపాయీల కవాతు పూర్తిఅయింది. వాళ్లు భోజనాలకు కూర్చు న్నారు. కాని ఒకళ్లూ కట్టెలవాణ్ణి రమ్మన లేదు పొమ్మనలేదు. వానికి కడుపులో ఎలి కెలు గెంతులేస్తూ వుండటంచేత, తనంత తనే పోయి ఒక విస్తరిముందు కూర్చు న్నాడు. అతను తిండి తిన్నంతసేపూ సిపా యిలు ఏమీ అనలేదు గాని, తీరా లేచి, పో బోయేవరకు, వాళ్లు "అబ్బాయీ, అలా పోవటానికి వీల్లేదు. మా తిండి తిన్నందుకు సరిపడేటట్టు పనిచేసి మరీ పోవాలి" అన్నారు. అందుచేత వాళ్ళతోపాటు—

"బుధవారం— కాదు, గురువారం.
గురువారం— కాదు, బుధవారం.
రైట్—లెఫ్ట్, రైట్—లెఫ్ట్"

డి. జగన్నాథరావు, బరంపురం



అంటూ కవాతు ప్రారంభించాడు. రాత్రి పూట వాళ్ళ మకాములోనే పడుకొని, తెల్ల వారగానే మళ్లీ "పోయివస్తాను" అన్నాడు.

ఇప్పుడుకూడా వాళ్లు పోనీయలేదు. "అబ్బాయీ! మాతిండి ఎవరైతే తింటారో, వాళ్లు కనీసం ఐదేళ్ళవరకైనా మా సేవ చేస్తూవుండాలి. ఒక్కొక్కప్పుడు పాతికేళ్ల వరకూకూడా ఉండిపోవలసివస్తుంది. ఇది మా నియమం" అని చెప్పారు.

వాళ్ళ తిండి తిన్నందుకు, చచ్చినట్టూ ఆ కట్టెలవాడు సిపాయిలతో పూర్తిగా అయిదేళ్ళపాటు ఉండిపోయి, వాళ్ళను సేవించుకొన్నాడు. గడువు తీరటంతోనే, అతను సేనాధిపతివద్దకు వెళ్లి, సెల విప్పించుమనేవరకు, సేనాధిపతి అతని సేవకు మెచ్చుకొని, ఒక పటకా, ఒక పిల్లనగ్రోవి, ఒక చొక్కా, ఒక లోహపుకూజా ఈ నాలుగూ బహుమతి చేశాడు. వాటితో మళ్లీ తన వూరి గుడిసె చేరుకుని, మునపటి వలెనే కట్టెలవృత్తి సాగించ నారంభించాడు.

ఒక రోజున తను సంపాయించుకు వచ్చిన బహుమతుల సంగతి జ్ఞాపకంరాగా, వాటిల్లో పటకా తీసి నడుముకి పెట్టుకుని, మామూలుగా అడివికి వెళ్లాడు. ఈ రోజున కూడా ఎప్పటివలె మూడణాలు మాత్రమే రాబడి వచ్చింది. ఇందుకు విచారిస్తూ, ఆ మూడణాలూ పటకా సంచిలో పడవేసు కొని, అతను ఇల్లు చేరుకొన్నాడు.

తరువాత బజారుకుపోయి, తన పటకా సంచిలో ఉన్న మూడు అణాలలోనూ ఒక అణా దుకాణదారునికి ఇద్దామని తీయ బోయాడు. తీరా చూచేసరికి మూడణాలకు బదులు మూడు వరహా లున్నాయి. ఈ మార్పుకి అతను నిర్ఘాంతపోయి, మాటాడక చల్లగా ఇంటికి మరలిపోయాడు.

మరునాడు యథాప్రకారం, కలప మోపుకి మామూలు మూడణాలే వచ్చింది.

పటకా సంచిలో వానిని పడవేసి, తిరిగి తీసే వరకు, మళ్ళీ మూడు వరహా లున్నయి. ఈ కీలకమంతా తను ధరించిన పటకాలోనే ఉన్నదని అతను గ్రహించాడు.

ఏ రోజు కారోజు అతను పటకాలో పడవేసే మూడణాకాసులూ మూడు వరహాలుగా మారిపోతున్నవాయె! ఇక శ్రీమంతుడు కావటానికి లోటేముంది? అతను కొద్దికాలంలోనే కోటీశ్వరుడైనాడు.

కొన్నాళ్ళకు కట్టెలవాడు కాలము చేయగా, అతని కుమారుడు ఈవృత్తి సాగించుతూ వచ్చాడు. కుర్రవానికి కూడా మోపుకి మూడణాలుమాత్రమే వచ్చేది. వాడు విరక్తితో ఒకనాడు తల్లివద్దకు వెళ్ళి "అమ్మా, అమ్మా! ఎన్నాళ్ళు శ్రమపడినా మోపుకి మూడణాలకు మించి ఒక్క దమ్మిడి అయినా ఎక్కువ రావటంలేదు. నాయనమాత్రం నేను కొట్టినన్ని కట్టెలేకద కొట్టేవాడు? కాని రాత్రి అయేసరికల్లా ఆయన వరహాలు కురిపించేవాడే? ఈ కీలకమేదో నాకు చెబితే కాని వీల్లేదు" అంటూ పట్టుపట్టి కూర్చున్నాడు.

ఆమె రహస్యం వెల్లడిచేయకుండా తప్పించుకోబోయింది. కాని, అతను



లొంగక, "చెబితేనే చెప్పావు. లేకుంటే పీక తెగవేస్తానని" బెదరించాడు. ఈ బెదరింపుకి భయపడి, ఆమె తక్షణమే కొడుకును ధనాగారములోకి తీసుకుపోయి, "నాయనా! ఇదుగో, నీ తండ్రి సంపాదించిన ఆస్తి అంతా ఇదే. బాగుపడతావో, చెడిపోతావో. ఆపైన నీఅదృష్టం" అని చెప్పింది.

అదంతా ఒక్కసారిగా చూచేవరకు, కుర్రవాని కళ్ళు జిగాలుమని, మనస్సు అనేక విధాల పరుగులెత్తింది. రాజకుమార్తెను పెళ్ళిచేసుకోవాలనుకొని, తన ఉద్దేశం ఆ దేశపురాజుకి తెలియజేశాడు. ఈ రాయబారం విని, రాజు నవ్వు పట్టలేక




పోయాడు. "సరే. రాజకుమారిని ఇస్తాము. ఒక వంద బస్తాలనిండా వరహాలు జాగ్రత్త పెట్టు" అని వేళాకోళంగా జవాబు పంపించాడు.

రాజు పంపినవార్తకు కుర్రవాడు "ఓస్, ఇంతేనా మహారాజు కోరిక! ఇంకా ఏమో అనుకొన్నాను" అని తలచి, గదిలోని ధనమంతా బస్తాలలోకి ఎక్కించాడు.

ఆ ధనంతో పూర్తిగా తొంభైతొమ్మిది బస్తాలు నిండినై, నూరవ బస్తా పూర్తి కాలేదు. అప్పుడు కుర్రవాడు తల్లితో "తొంభైతొమ్మిది బస్తాల ధనం సంపాదించగలిగిన నా తండ్రి అంతటితో ఊరుకుంటాడా? ఇంకా ధనం ఉండివుండాలి. ఎక్కడ దాచావో చెప్పు" అన్నాడు.

తల్లి ఎంత చెప్పినా లాభం లేకపోయే వరకు, ఆమె కుర్రవానికి భర్త సంపాదించిన పటకా ఇచ్చి, దాని రహస్యం వెల్లడించింది. ఈ రహస్యం తెలిసిన కొద్దిరోజులకే కుర్రవాడు ధనం పోగుజేసి, నూరోబస్తా పూర్తిచేసి, రాజుగారికి పంపించాడు.

నూరు బస్తాల వరహాలూ అందుకోగానే రాజు ఆశ్చర్యపడి, కుర్రవాడిని రమ్మని కబురుచేశారు. "ఓయి అబ్బాయీ!—నీ ప్రజ్ఞకు చాలా సంతోషించాము, షరతు నెరవేర్చావు గనక మా అమ్మాయిని నీకిచ్చి పెళ్ళి చేయటానికి ఏమీ అభ్యంతరము లేదు. కానైతే, ఇంతత్వరలో మేము కోరిన ధనమంతా ఎలా సమకూర్చగలిగావో మేము తెలుసుకోవాలి. మా అభిలాష తీర్చావంటే, పెళ్లిసన్నాహాలు చేయిస్తాము" అని రాజు అతన్ని లాలన చేశాడు.

రాజు పలికిన పలుకులన్నీ యదార్థమే అనుకొని, కుర్రవాడు పటకాను గురించిన కీలకం వెల్లడించివేశాడు. ఈ రహస్యం తెలియగానే, రాజు "ఓరి దౌర్భాగ్యుడా! ఇందంతా నీ ప్రజ్ఞ ఏమో అనుకొన్నాను.

ఇంతాజేసి ఈ పటకా సహాయంతోనా ఇంత గమ్మత్తుచేశావు. ఇటువంటి పటకా ప్రభువులదగ్గర ఉండాలిగాని నీ వద్ద ఉండ వచ్చునా" అంటూ గర్జించాడు. అంతలో భటులువచ్చి అతన్ని చితక మోది, పటకా ఊడదీసి లాక్కొన్నారు.

ఇక యిప్పుడు చేసేదేముంది? దేవుడా అంటూ ఇంటికి మరలి, తనకు కలిగిన పరాభవాన్ని గురించి తల్లితో చెప్పుకొని ఏడిచాడు.




కుర్రవాని గోల భరించలేక ఆమె, భర్త దాచివుంచిన వస్తువులలో పిల్లనగ్రోవి పట్టుక వచ్చి, "నాయనా! ఈ పగిలిపోయిన పిల్లన గ్రోవి మాత్రమే మనకు మిగిలిఉన్న ఆస్తి. ఇది తీసుకుపో. బాగుపడినా, చెడి పోయినా నీ అదృష్టం," అని చెప్పింది.

దీని మహిమ ఏమిటో చూదామని అతను నోటిలో పెట్టుకుని ఒక్కసారి ఊదే వరకు, ఒక సిపాయివచ్చి, ఎదట నిల బడ్డాడు. మళ్ళీ ఊదినప్పుడల్లా ఒక్కొక సిపాయి ప్రత్యక్షమవుతూ వుండేసరికి ఈ మహిమ చూచి అతను సంతోషించాడు.

ఇలా ఆ కుర్రవాడు - అనేకమంది సిపాయిలను సృష్టించేవరకు, రాజ్యమంతా సైన్యంతో నిండిపోయింది. ఈ వార్త రాజుకి తెలిసి, కట్టెలవాని కొడుకుకు కబురు పెట్టాడు. "అబ్బాయీ! నువు ఇంత గొప్పవాడివని మాకు తెలియకపోయింది. ఈసారి మా అమ్మాయిని నీకు తప్పకుండా పెళ్ళి చేస్తాము. అయితే, నీకు ఈ సేన ఎలా సమకూడిందో ఆ కీలకం మాకు చెప్పాలి" అని పొగడేసరికి, కుర్రవాడు ఉబ్బిపోయి, పిల్లనగ్రోవిని గురించిన రహస్యం వెల్లడి చేసివేశాడు.

ఈ రహస్యం తెలియగానే రాజు మున పటివలెనే కుర్రవాణ్ణి గద్దించి, వానిని మెత్తగాతన్నించి, పిల్లనగ్రోవి లాక్కున్నాడు.



మళ్లీ కుర్రవాడు ఏడుస్తూ తల్లివద్దకు వచ్చి వలపోసికోగా, ఆమె జాలిదలచి, భర్త విడిచిపోయిన బహుమతి వస్తువులలో మూడవది అయిన చింకిచొక్కా ఇచ్చి "ఇదే ఉన్నది నాయనా! నీ అదృష్టం ఎలా ఉంటుందో చూచుకో" అన్నది.

ఈ చింకిచొక్కా చిత్ర మేమిటో, చూతామని కుర్రవాడు తొడుగుకొనేసరికల్లా తన మనసులోని ఉద్దేశంప్రకారం రాజుగారి కోటలో ఉన్నాడు. కోటలోకి వెళ్లి చొక్కా తీసివేసేసరికల్లా ఇంటిలో వున్నాడు! మళ్ళీ చొక్కా వేసుకొన్నాడు. తక్షణమే కోటలో ప్రత్యక్షమైనాడు. ఈ కీలకం తెలిసినతరువాత ఇక ఆలస్యం చేయకూడదని తలచి చరచర రాజకుమారి అంతఃపురంలోకి పోయి, ఆమెను పలుకరించబోయాడు.

ఇలా రోజూ అతను ఆమెవద్దకు వస్తూపోతూ ఉండేవరకు, రాజకుమారి భయపడి ఒకనాడు ఈ సంగతి తండ్రితో వెల్లడించింది.

అప్పుడు రాజు, ఈ మహిమగల చొక్కాను కాజేయటానికి ఒక సేవకుని నియమించాడు. ఆ సేవకుడు కన్నముగల ఒక పెట్టెను రాజకుమారి గదిలో పెట్టించి, అందులో తను దూరి కూర్చున్నాడు. ఈ సారి కుర్రవాడు వచ్చి, చొక్కా విప్పి అక్కడ పెట్టగానే యుక్తిగా వాడు ఆ చొక్కాను కాజేశాడు.

ఇంతలో రాజకుమారి గోల చేసేవరకు, కోటలోని పరివారము అతనిని చుట్టుముట్టి, మునుపటికంటె ఎక్కువగా తన్ని వదలిపెట్టారు.

అతను చచ్చి చెడి తప్పించుకొని సిగుతో తల్లివద్దకువచ్చి 'బుదివచ్చింది. క్షమించు' మంటూ ప్రాధేయపడ్డాడు.

కుమారుని అవస్థచూచి, ఆమెకు కడుపు కరిగిపోయింది. తన భర్త సంపాయించిన

జహుమతులలో చివరకు మిగిలిన కూజా కొడుకు చేతిలో పెట్టి, "నాయనా! మన ఆస్తిలో ఇదే కడాపటిది. నీ గీత ఎలా వుంటుందో చూచుకో" అన్నది.

ఆ కూజా పట్టుకుని అతను రివ్వున పొలాలలోకి పారిపోయాడు. పోయి పోయి తన కూజా పక్కని పెట్టుకుని ఒక పర్వతం దిగువ కూర్చున్నాడు. వెంటనే ఒక దివ్యమైనటువంటి తోట కనపడింది. ఆ తోట రకరకముల ఫలజాతులతో నిండి వున్నది.

ఆ చెట్ల పళ్లు చేతికి అందుతూవున్నయి. తన దగ్గరగా వుండే ఒక చెట్టునుంచి ఒక రేగుపండు తుంచి, తినబోయాడు. అది గొంతు దిగిందో లేదో, అతని తలమీద రెండు గొట్టికొమ్ములవంటివి మొలవ నారంభించాయి.

ఏమీ తోచక అతను చేయిచాపి, మరొక చెట్టునుంచి జామిపండువంటిది తీసుకుని తినబోయాడు. అది నోటికి తగలడంతోనే అతను ఒక గాడిద స్వరూపం పొంది; గాడిదఅరపులు అరవటం ప్రారంభించాడు. గాడిద రూపంలో ఉన్న కట్టెలవాని కొడుకు ఆ దగ్గరనే ఒక బంజరులో గడ్డి మేయ




బోగా, ఆ గడ్డి కొరికిన తక్షణమే అతను తిరుగా మామూలు మనిషి అయిపోయాడు.

ఈవిధంగా మార్పులు కలిగిన తరవాత, అతను ఆ ఫలాలూ ఆ గడ్డీ ఆనవాలు పెట్టుకొని, రక్షానికి కొంచెం తీసుకొని, జేబులు నింపుకొన్నాడు. ఒక యోగివేషంతో దైవ ప్రార్థనలు చేసుకొంటూ అతను పోతూ వుండగా, పదిమందీ కలసి ఆ యతీశ్వరుని వద్ద ఏమైనా మహత్తు ఉన్నదేమో, తెలుసుకొని మేలు పొందుదామనే ఆశతో గుమికూడారు.

ఒక చెట్టుకింద యతి బస ఏర్పరచుకొని, వాళ్ళకు ఉపదేశం చేయ నారం

భించాడు. ఆ శిష్యులలో తనను హింసించిన రాజభటులుకూడా ఉన్నారు. వాళ్ళకు తనపైన నమ్మకం కుదిరినట్టు కనిపెట్టి, ఒక్కొక్కళ్లకు ఒక్కొక్క రేగిపండు ఇచ్చి తినుమన్నాడు.

వాళ్ళు ఆ పండ్లు తినగానే తలలపైన గొర్రెకొమ్ములు మొలవ నారంభించాయి.

ఆ శిష్యులు పదిమందీ యతీశ్వరుని కాళ్ళపైన పడి, "మహాత్మా! ఏ పాపమూ ఎరుగని మాకు ఇటువంటి కఠిన శిక్ష విధించారేమిటి? దయవుంచి, ఈ కొమ్ములు పోగొట్టండి" అంటూ, బతిమలాడారు.

"అయితే, మీరు నన్ను కొట్టి, నావద్ద నుంచి లాగికొన్న పటకా, పిల్లనగ్రోవి, చింకిచొక్కా నాకు పట్టుకవచ్చి ఇయ్యండి. రాజు వాగ్దానంప్రకారం, రాజకుమారికీ నాకూ పెళ్లి ఏర్పాటుచేయండి" అన్నాడు. అప్పుడు వారు 'ఓహో, ఈ యతీశ్వరుడు ఫలానాకదా' అని చెప్పి గుర్తించారు.

గత్యంతరంలేక, ఆ పరిచారకులు వెంటనె కోటకు పోయి, రాజుతో దెబ్బలాడి, కట్టెలవాని కొడుకువద్ద అన్యాయంగా లాగికొన్న మూడువస్తువులూ తిరిగి పట్టుక వచ్చి, అతనికి ఇచ్చివేశారు. అప్పుడు అతను వాళ్లచేత గడ్డి తినిపించి, కొమ్ములు పోగొట్టేవరకు, వాళ్లు బలుకుజీవుడా అను కొని, ఎంతో సంతోషించారు.

అతని మహత్తు తెలుసుకొన్న ఆ పరిచారకులు రాజును గద్దెమీడినించి తొలగించి, కట్టెలవాని కొడుకునకే పట్టం కట్టారు. రాజకుమారిని అతనికి పెళ్ళి చేశారు. అంతగా తనను పరాభవించిన రాజుకి మాయజామిపండుఇచ్చి తినుమనే సరికి, పాపం రాజు గాడిదగా మారిపోయి, బ్రతికి ఉన్నంతకాలమూ బేబేఅని అరుస్తూ వుండిపోయాడు.

ఈవిధంగా రాజు, తను చేసిన పాపాలకు ఫలితం అనుభవించాడు.



# చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

## ఆధారములు

### అడ్డము:

1. ఆడవాళ్లు కట్టుకుంటారు
3. పువ్వులతో చేయునది
5. అరణ్యము
6. దేశము
7. పూలమాల (సమాసము)
9. అక్షరములు
11. రెండవ వంతు
13. పల్లము కానిది
14. దూషణ




### నిలువు:

1. ఒకవిధమైన పురుగు
2. సూర్యుడు
3. ఒక నగరము పేరు
4. భయము
5. సందేహము
8. ఐశ్వర్యము
10. పక్షి
11. పతివ్రత
12. తీరము

## ఏటుకూరి (నరసయ్య)



వినవోయి బాలుడా! వినరాని వార్త!
కనలేవు నీవిక కవి యేటుకూరి
కలకాలమువనుండి కథలెన్నొ మనకు
కలిపించి యిచ్చెను కరుణతో నెపుడు.
నిడుబ్రోలునందున నివసించుచుండె
కడునేర్పుతోడను కాలంబు గడపె
ఉన్నత బడిలోన ఉద్యోగ మంది
పొన్నూరి బాలుర పొందుతో నుండి
బాలుర సంగతి బాగుగ నెఱిగి
చాలగ వ్రాసెను చక్కని కథలు.
"మగువ మాంచాల" ను మక్కువ వ్రాసె
బాగుగ నుండును బాలురకెల్ల
వెనుకనే కథలకు వివరము వ్రాసె.
కనుకనే వీరిని "కవిబ్రహ్మ" యనిరి.
బాలుడు బాలిక భార్యయు గలరు
బాల బాలికలార! పంపుడు జాబు
చాలగ ఓదార్పు సంగతి వ్రాసి.

రచన:
శివరాజు వెంకట సుబ్బారావు, బాపట్ల




# పిల్లల పెంపకం

## ని వా స ము

పిల్లలు గల ఇల్లు ఎలా ఉండాలి?—ఇది చాలా ముఖ్యమైన ప్రశ్న.

గాలీ, వెలుగూ బాగా ప్రసరించే స్థలం బిడ్డలకు ఆరోగ్యాన్ని ఇస్తుంది. ఆరోగ్యం ఎప్పుడైతే చేకూరిందో, అప్పుడే మనస్సుకీ శరీరానికీ సుఖంగా వుంటుంది.

గొప్ప భవనాలలో ఉన్నట్టయితే సౌఖ్యంగా ఉంటుందని చాలామంది అనుకొంటూ వుంటారు. కాని, ఇది తప్పుటభిప్రాయమే అని చెప్పవలసి వస్తుంది. భాగ్యవంతుల దివ్యభవనాలు చూడటానికి ఎంతో డాబుగా ఉండవచ్చు, వాటిల్లో నివసించేవారు అతి వైభవంగా ఉన్నట్టుకూడా కనపడవచ్చు. కాని, ఆ భవనాలలో నివసించేవా రందరూ ఆరోగ్యంగా హాయిగా ఉన్నారని చెప్పటానికి వీలులేదు.

ఆరోగ్యదృష్టితో చూచితిమంటే - గాలీ, వెలుగూ ప్రసరించే ఏర్పాటులు ఉన్నపక్షమందు, దివ్యభవనాలకంటే పూరిల్లేకానీ, పర్ణశాలేకానీ, కుటీరమేకానీ మేలు.

ఇంటిలో స్నానానికి, భోజనాలు చేయుటానికి, నిద్రించడానికి ఏర్పాటయిన ప్రదేశాలలో కొంత తెరపిఅయిన జాగా ఉండటం శ్రేయస్కరం. తెరపిఅయిన ఇటువంటి ప్రదేశంలో ఆరోగ్యంతోపాటు అనందంకూడా వృద్ధిపొందుతుంది.

ఇంటి పెరటిలో చిన్న తోట ఉన్నట్లైతే, మరింత అనందంగా వుంటుంది. పెరడు లేని చోటులందు మట్టికుండలలోనైనా పూలమొక్కలువేసి పెంచుకోవడం అవసరమని నావుద్దేశం. ఇలా చేయుటంవల్ల మనస్సుకి అనందం, ఇంటికి అందం ఇస్తుంది.

తులసి, భూతులసి, రుద్రజడ మొదలైన మొక్కలు పెరట్లో ఉంటే ఆ మొక్కల మీదినించి ప్రసరించే గాలి ఎంతో ఆరోగ్యాన్ని కలుగజేస్తుంది. పెరట్లో వేపచెట్టు ఉన్నట్టయితే, దానిమీదినించి ప్రసరించే గాలివల్ల చాలా అరోగ్యం కలుగుతుందని వైద్యులు, అనుభవజ్ఞులు చెబుతున్నారు.

'మీ పెద్దమ్మ'

# అట్టమీది బొమ్మ

పూర్వకాలమందు పాములన్నీ గరుత్మంతుణ్ణి పూజిస్తూ వుండేవి. కాని నాగులలో గర్వి ఐన కాళింగుడు మాత్రం అలా పూజచేయక నిరసించేవరకు, గరుత్మంతునికీ కాళింగునికీ మధ్య పేచీపడి, యుద్ధంజరిగింది. ఆ యుద్ధంలో కాళింగుడు ఓడిపోయాడు.

యమునానది జలం తాకినట్టైతే మరణం సంభవిస్తుందని గరుత్మంతునికి ఒక ఋషి శాపం ఉన్నది. కనుక గరుత్మంతుడు ఎన్నడూ ఆ నదిచేరువకు పోయేవాడుకాదు. ఈకీలకం తెలిసిన కాళింగుడు కుటుంబంతోసహా యమునా నది చేరుకొని, అక్కడ ఒక లోతైన మడుగులో కాపురం పెట్టాడు.

ఐతే - కాళింగుడు ఇక్కడకు వచ్చినప్పటినించీ ఆ నదీజలమూ, అక్కడి గాలీకూడా విషపూరితమై, బృందావనంలోని ప్రాణికోటి చచ్చి పోజొచ్చిందీ. అందుచేత గోకులంలో ప్రజలంతా తహతహలాడిపోయారు.

అప్పుడు శ్రీకృష్ణుడు కాళింగుడు ఉండే మడుగువద్దకు వెళ్ళి, అక్కడ ఒక కదంబవృక్షం ఎక్కి, గభీమని మడుగులో పలికి దూకి, కాళింగుని నడుంమీద పడ్డాడు. కాళింగుడు రోషపూరితుడై తన వేయిపడగలూ విప్పుకొని, బుస్సుమంటూ నీటిపైకివచ్చి కృష్ణుణ్ణి కదలకుండా చుట్టబెట్టేసరికి, అక్కడ వున్న గోవులన్నీ బావురుమంటూ ఏడిచాయి. అందరూ స్మృతితప్పిపోయారు.

కాని, అంతలోనే కృష్ణుడు అపారంగా బరువెక్కి కాళింగునిపైన నృత్యం చేసి మర్దించేవరకు,. కాళింగుని నడుము లటుక్కుమని, కృష్ణుణ్ణి పట్టు వదిలేసింది. అప్పుడు కాళింగుని భార్యలిద్దరూ వచ్చి, 'కటాక్షించి, మాకు పతిభిక్ష పెట్టు దేవా!' అని అవతారమూర్తిఅయిన కృష్ణుణ్ణి వేడుకొన్నారు.

శ్రీకృష్ణుడు అప్పుడు "ఓయి కాళింగా! ఇప్పుడు నా పాదాలు నీ తల పయిన ముద్రపడి ఉన్నవి. గనుక, ఇవి చూచినట్టయితే గరుత్మంతుడు నిన్ను ఏమీ చేయడు. అతని భయం నీకు ఉండదు. కనుక, నీవు ఇదివరకు నివసిస్తూవుండిన రమణకద్వీపానికి వెంటనే వెళ్ళిపో," అని అనేవరకు, కాళింగుడు కుటుంబముతోసహా యమునానదివిడిచి స్వస్థలానికి వెళ్లిపోయాడు.




## గాజుబుడ్డీలో కోడిగ్రుడ్డు!

ఈ ట్రిక్కు చేయటం చాలా తేలిక. కాని, చూచేవాళ్ళకు మాత్రం 'అబ్బా! ఏమిటా ఈ చిత్రం!' అని ఆశ్చర్యంగా కనపడు తుంది. ఇంద్రజాలికుడు ముందుగా ఒక మామూలు కోడిగ్రుడ్డును సభవారికి చూపించి, వారు తృప్తిపడిన తరువాత, దానిని ఒక సన్నటి మూతిగల సీసాలోకి దూరుస్తాడు.

ఈట్రిక్కు చాలా సులువు. మామూలు కోడిగ్రుడ్డు ఒకటి తీసుకొని, దానిని 30 మొదలు 40 గంటలసేపు గాఢమైన అసెటిక్ యాసిడ్ (Acetic Acid)లో గాని, 'వినిగార్' (Vinegar) అనే ద్రావకంలోగాని నానబెట్టాలి. గ్రుడ్డు మునిగేపాటి ద్రావకం తీసుకొంటే చాలు. ఇది విషంగనుక, దీనిని జాగ్రత్తగా ఉపయోగించటం, పని తీరిన తరువాత చేతులు శుభ్రంగా కడుగుకొనటం అవసరం. గ్రుడ్డు ద్రావకంలో పూర్తిగా మునిగినతరువాత ద్రావకం ఘాటు పైకి పోకుండా గాలి చొరకుండా వుండేటంత బిగువుగా మూత పెట్టాలి. ఇదికూడా చాలా అవసరం. పైనచెప్పిన గడువు తీరినవెంటనే గ్రుడ్డును బయటకు తీయాలి.

ఐతే, ఇక ప్రదర్శనం కొద్దిసేపటిలో జరుగుతుందన్నప్పుడే ఈవిధంగా గ్రుడ్డును నానబెట్టి, తయారుచేసి, ప్రదర్శన సమయానికి ఆ గ్రుడ్డును ఎవ్వరికీ కనపడకుండా వుండేట్టు మేజిక్‌టేబిల్ సమీపంలో గాని, జేబులోగాని దాచివుంచాలి.

ఇలా నానబెట్టి సిద్ధంచేసికొన్న గ్రుడ్డును దాచివుంచిన పిమ్మట, మామూలు కోడి గ్రుడ్డు ఒకటి పట్టుకువచ్చి సభవారికి చూపించి, 'బాగా పరీక్ష చేసుకోండి' అంటాడు ఇంద్రజాలికుడు.

'చూసుకొన్నారు కద! ఇప్పుడీ గ్రుడ్డును ఈ సన్నటి మూతిగల సీసాలోకి పంపించి వేస్తాను చూడండి!' అని మళ్లీ అంటాడు.

ఒకవేళ నానబెట్టిన గ్రుడ్డుకి యాసిడ్ వల్ల ఏదైనా మచ్చ ఏర్పడితే, జాగర్తగా కనిపెట్టి, సభవారికి పరీక్షనిమిత్తం ముందుగా చూపించే మామూలు గ్రుడ్డుపైన కూడ అదే మోస్తరు మచ్చ ఉండేటట్టు చేయాలి. అనగా రెండూ ఒక్క మోస్తరుగా ఉండాలన్నమాట. ఎందుచేతనంటే, దానికీ దీనికీ తేడా ఉన్నపక్షమందు, సభలోని బుద్ధిమంతులు మనరహస్యాన్ని సులువుగా పట్టివేస్తారు.

మామూలుగ్రుడ్డును సభవారికి చూపించి తిరిగి టేబిల్‌వద్దకు వచ్చేలోపల ఆ గ్రుడ్డు తీసివేసి, దానికిబదులు, తయారుచేసిన గ్రుడ్డు చేత పుచ్చుకోవాలి.

తయారుచేసిన గ్రుడ్డు రబ్బరువలె మెత్తబడిపోయి సాగుతుంది. కాని గ్రుడ్డు యిలా మెత్తగా సాగుతున్నట్టు ప్రేక్షకులకు తెలియకుండా జాగ్రత్తపడటం చాల అవసరం. దీనిని సులువుగా సీసాలోపలికి దూర్చవచ్చు. తర్వాత చన్నీళ్లుగాని, మంచు కలిపిన నీళ్ళుకాని సీసాలోపోస్తే, సీసాలో వున్న మెత్తటిగ్రుడ్డు తిరిగి గట్టిపడుతుంది.

ఈ ట్రిక్కు ఎవరికైనా తెలిసిపోతుందేమోనని జంకు లేకుండా, నిర్భయంగా





చేయవచ్చు. విద్యార్థిగా ఉండేరోజుల్లో నేను ఈ ట్రిక్కు చేయటంచూచి, తోడి విద్యార్థులేగాక, ఉపాధ్యాయులుకూడా ఆశ్చర్యపడేవారు. కాని, ఇది ఎలా చేస్తున్నానో మట్టుకి వాళ్ళు కనుక్కోలేక పోయేవారు. ఆలిండియారేడియో, కలకత్తా కేంద్రంనించి గారడిగురించి ప్రసంగిస్తూ, ఈ ట్రిక్కును గురించిన రహస్యమే చెప్పాను. ఇది చాలా గమ్మత్తైన ట్రిక్కు కాదూ? ఏమంటారు?

[ఈ గారడీ ట్రిక్కులనుగురించి మీ అభిప్రాయాలూ, మీకుగల సందేహాలూ సరాసరి సర్కారుగారికే వ్రాస్తే, వారు మీకు జవాబిస్తారు. వారికి ఉత్తరాలు ఇంగ్లీషులోనే రాయాలి. ఈ మాట జ్ఞాపకం ఉంచుకోండి. వారి అడ్రెసు:—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మేజిషియన్,
పోస్టుబాక్సు 7878, కలకత్తా—12.

साँझ हो गई ।
सूरज डूबा ।
रमणी और राम घर लौटे ।
उनके घर में दिए जल गए ।
घर के सब लोग आ गए ।
पर रमणी के पिता नहीं आए ।
अब खूब अन्धेरा पड़ गया ।

नौकर पानी लाया ।
राम और रमणी गरम पानी से नहाए ।
खाना तैयार हो गया ।
सब लोग खाने बैठे ।
खा-पीकर राम और रमणी पढ़ने लगे ।
थोड़ी देर पढ़ कर सो गए ।
घर में दिए बुझ गए ।

अब चाँद निकल आया ।
चारों ओर चाँदनी छा गई ।
ठण्डी हवा चलने लगी ।

उनके = వారియొక్క
दिए = దీపములు
जलना = వెలుగుట, మండుట
पर = కాని
पिता = తండ్రి
अब = ఇప్పుడు
अन्धेरा = చీకటి
पड़ना = పడుట
नौकर = నౌకరు
निकलना = బయటికివచ్చుట, ఉదయించుట
चाँदनी = వెన్నెల

हवा = గాలి
नहाना = స్నానముచేయుట
तैयार = తయారు
खा-पीकर = భోజనముచేసి
लगना = సాగుట
थोड़ी = కొంచెము
देर = ఆలస్యము, సేపు
सो = నిద్రించు
बुझ = ఆరు
चाँद = చంద్రుడు
चारों ओर = నలువైపుల
छा = వ్యాపించు

चल = వీచు, నడచు

ఇది సామాన్య భూతకాలము. ఇందులో ధాతురూపానికి క్రమంగా ఏక వచన, బహువచన, స్త్రీలింగాలలో आ, ए, ई లు చేర్చాలి. ఇవి పూర్తి అక్షరాలుగాగాక ा े ी లుగా కూడా వస్తాయ్. సామాన్య భూతకాలం జరిగిపోయినదాన్ని సూచిస్తుంది.



కె. విమల, గుంటూరు

పజిలుకు జవాబు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | | | | 1 చీ | 2 ర | |
| 3 పూ | 4 జ | | 5 అ | ధ | వి | |
| 6 నా | డు | | ను | | | |
| | 7 పు | ష్ప | మా | లి | 8 క | |
| | | | న | | 9 లి | 10 పి |
| | 11 స | 12 గ | ము | | 13 మి | ట్టి |
| | 14 తి | ట్టు | | | | |



ఈ నెలతో 'గుణసుందరి' పూర్తి అయింది. వచ్చే నెలనుండి మరొక ముచ్చటైన పెద్ద కథ ప్రారంభమవుతుంది. ఎదురు చూడండి.






ఈ బొమ్మకి రంగులు వెయ్యండి. మీరు రంగులువేసిన బొమ్మని వచ్చేనెల (జనవరి) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Controlling Editor : SRI CHAKRAPANI




పైన కనిపిస్తున్న తల్లిబాతువి రెండు కవలలు, మరి ఎనిమిది బాతు పిల్లలలో కలిసిపోయినై. తల్లిబాతు తన కవల పిల్లల్ని గుర్తుపట్ట గలదు. ఎందువల్లనంటే ఆ రెంటికీ కొంచెంకూడా తేడా లేదు. మరి మీరు ఆ కవలల్ని కనిపెట్టగలరా? మీరు కనుక్కోలేకపోతే జవాబు యిక్కడనే ఉంది చూడండి.

---

3, 9 నెంబర్లు గల బాతు పిల్లలు రెండూ తల్లిబాతుయొక్క కవలలు

# మంచి మంచి పుస్తకాలు

మా ప్రచురణలు అన్నీ హిగిన్‌బాథమ్స్ బుక్ స్టాళ్ళలోనూ దొరుకుతవి. లేదా మాకు వ్రాయండి. ఒకేసారిగా 6-0-0 పుస్తకాలు తెప్పించినవారికి పోస్టు ఖర్చులు మేమే భరించెదము. లైబ్రరీలకు, పుస్తక వ్యాపారులకు మంచి కమిషన్ ఇవ్వబడును. వివరాలకు వ్రాయండి.

## శరత్‌బాబు రచనలు

| | | | |
|---|---|---|---|
| వాగ్దత్త | [నవల] | 1 | 12 |
| శుభద | .. | 1 | 8 |
| దేవదాసు | .. | 1 | 8 |
| పల్లీయులు | .. | 1 | 8 |
| నవవిధాన్ | .. | 1 | 0 |
| చంద్రనాథ్ | .. | 1 | 0 |
| పరిణీత | .. | 0 | 12 |
| బడదీదీ | .. | 0 | 12 |
| పతివ్రత | .. | 0 | 12 |
| హేమాంగిని | .. | 0 | 12 |
| నిష్కృతి | .. | 0 | 12 |
| మాబారు | .. | 0 | 12 |
| కాశీనాథ్ | .. | 0 | 12 |
| మహేశుడు | [కథలు] | 0 | 12 |
| నారీర్ మూల్య | [వ్యాసం] | 0 | 12 |

## డిటెక్టివు నవలలు

| | | | |
|---|---|---|---|
| కడపటిమాట | [రాధాకృష్ణ] | 0 | 12 |
| మాయమైన మణిహారం | .. | 0 | 12 |
| తప్పిపోయిన పెళ్లికూతురు | .. | 0 | 12 |
| తగినశాస్తి | .. | 0 | 12 |
| పారిపోయిన యుద్ధఖైదీ | .. | 0 | 12 |
| దివాలా ఎస్టేట్ | .. | 0 | 12 |
| అంతులేని ఆశ | .. | 0 | 12 |

## చక్రపాణి అనువాదాలు

| | | | |
|---|---|---|---|
| నారీద్వేషి | [మైత్రా] అనువాదం కథలు | 1 | 8 |
| పరాజయం | .. .. .. | 0 | 12 |
| ఉదరనిమిత్తం | [నాటకం] | 1 | 0 |
| వల్లభపురం చిట్టడవిలో | [రాయ్‌చౌధరి] | 0 | 12 |
| హనుమంతుని స్వప్నం | [పరశురాం] | 0 | 12 |
| మెట్టవేదాంతం | [వనఫూల్] | 1 | 0 |
| బెంగాలీకథలు | [మనోవైజ్ఞానిక కథలు] | 0 | 12 |
| ప్రగల్భప్రేతము | [అత్యుత్తమ కథలు] | 0 | 12 |
| పాంచజన్యం | [రాజకీయ కథలు] | 0 | 12 |
| డిటెక్టివు | [నాటకం] | 0 | 12 |
| లంబకర్ణ | [పరశురాం కథలు] | 1 | 0 |
| బంధి | [యతీంద్ర మోహనసింహా] | 1 | 12 |

## కుటుంబరావు రచనలు

| | | | |
|---|---|---|---|
| నిలవనీరు | [అత్యుత్తమ కథలు] | 1 | 8 |
| మొండివాడు | .. | 1 | 0 |
| కాలభైరవుడు | .. | 0 | 12 |
| వరప్రసాదం | .. | 0 | 12 |
| కవిరాట్టు | [గల్పికలు] | 0 | 12 |
| కులంలేని మనిషి | [నవల] | 0 | 12 |
| అరుణోదయం | .. | 1 | 0 |
| మారుపేర్లు | .. | 0 | 12 |
| ఏకేం కావాలి? | .. | 0 | 12 |
| ప్రణయరోగులు | [నాటకం] | 1 | 0 |
| ఆరితేరిన ఘటం | (విదేశ కథలు) | 0 | 12 |
| రష్యన్ కథలు | | 0 | 12 |

## చలంగారి రచనలు:

| | | |
|---|---|---|
| శ్రీ | | 2- 0-0 |
| ప్రేమలేఖలు I | | 1-12-0 |
| ప్రేమలేఖలు II | | 1- 8-0 |
| బిడ్డలశిక్షణ | | 1- 8-0 |
| విషాదం | | 1- 0-0 |
| ఆనందం | | 1- 0-0 |
| చిత్రాంగి | [నాటకం] | 1- 8-0 |
| త్యాగం | " | 1- 8-0 |
| మంగమ్మ | " | 1- 0-0 |
| జయదేవ | " | 1- 0-0 |
| శశాంక | " | 1- 0-0 |
| సావిత్రి | " | 0-12-0 |
| సత్యం, శివం, సుందరం | | 1- 4-0 |
| నాటికాగుచ్ఛం | | 1- 4-0 |
| కర్మ మిట్లా కాలింది | [కథలు] | 1- 8-0 |
| కన్నీటికాలువ | " | 0-12-0 |
| పాపం!!! | " | 0-12-0 |
| దైవమిచ్చిన భార్య | [నవల] | 1- 8-0 |
| మైదానం | " | 1- 0-0 |
| అమీనా | " | 1- 0-0 |
| వివాహం | " | 1 -0-0 |
| బ్రాహ్మణీకం | " | 0-12-0 |
| అరుణ | " | 0-12-0 |
| హంపీకన్యలు | " | 0-12-0 |
| అదృష్టం | " | 1- 0-0 |
| వాళ్ళు వలుగురూ | " | 0-12-0 |
| పురూరవ | నాటకం | 1- 8-0 |

## వివిధ రచయితలు

| | | | |
|---|---|---|---|
| ఈస్ట్‌లిన్ | [నవల] | | 2- 0-0 |
| చచ్చిపోయిన మనిషి | [పద్మరాజు] | నవల | 0-12-0 |
| కదంబం | [నార్ల] | | 0-12-0 |
| పొగడదండ | [కొ. పద్మావతి] | కథలు | 0-12-0 |
| రూం-టు-లెట్ | [బాలకృష్ణశాస్త్రి] | .. | 0-12-0 |
| సిపాయికథలు | [శిష్ట్లా] | " | 0-12-0 |
| మూగజీవాలు | [గోఖలే] | " | 1- 4-0 |
| రాజూ-మంత్రీ | [యం. యస్. మూర్తి] | | 0-12-0 |
| చుక్కలూ గీతలూ | .. | " | 1- 0-0 |
| హర్ హైనెస్ | | | 1- 0-0 |
| పలితకేశము | [దువ్వూరి] | కావ్యం | 1- 0-0 |
| స్వప్నవాసవదత్తము | [కాటూరి] | నాటకం | 0-12-0 |
| సెలవు | [కప్పగంతుల] | | 1- 0-0 |
| ఋణవిముక్తి | .. | | 1- 0-0 |
| సంజీవి | [ధనికొండ] | కథలు | 1- 0-0 |
| గర్వభంగం | .. | " | 1- 0-0 |
| ప్రియురాలు | .. | " | 1- 0-0 |
| తీర్పు | " | కథలు-నాటిలు | 0-12-0 |
| పవిత్రులు | " | దృశ్యనాటిక | 1- 4-0 |
| ఎర్రబిట్టలు | " | దృశ్యనాటికలు | 1- 8-0 |
| కళ్యాణి | [సోమంచియజ్ఞన్నశాస్త్రి] | నాటకం | 0-12-0 |
| విశ్వంపెళ్ళి | .. | .. | 0-12-0 |
| జ్యోతిర్మయి | [అ. వెం. నర్సు] | .. | 1- 0-0 |

## యువ బుక్ డిపో

పోస్టు బాక్సు నెం. **1686**, మద్రాసు, 1.

డిశెంబరు 2వ తేదిన విడుదల

ఆంధ్రదేశమున అన్ని ముఖ్య కేంద్రములలో



భాగ్యపిక్చర్సు వారి

# మంగయర్కరసి

చిన్నప్ప • కన్నాంబ • అంజలీదేవి • కృష్ణన్
మధురం • దొరైరాజ్ • లలిత • పద్మిని






డిస్ట్రిబ్యూటర్లు ఆంధ్రా ఫిలిం సర్క్యూటు 18/168బి, గాంధినగర్
విజయవాడ



Chandamama, December, '49 Photo by Marcus Bartley

ఇ హి హి !!

CHANDAMAMA (Telugu) December 1949 Regd. No. M. 4854




పడతావ్, జాగ్రత్త! గట్టిగా పట్టుకో!